శ్రీః

శ్రీ పరాంకుశ – యతివర – వరవరమునుల శ్రీచరణములే శరణము.

నమ్మాళ్వార్లు అనుగ్రహించిన

# తిరువాయ్ మొழி—౬-వ పత్తు.

## షష్ఠ శతకము

శ్రీమత్కాంచీ ప్రతివాదిభయంకర అణ్ణంగరాచార్యస్వాములు
కృపచేసిన టీకతో కూడినది.

శ్రీ రామానుజ పత్రిక ప్రచురణము

మద్రాసు, 'శ్రీ గోపాలకృష్ణా' ప్రెస్సులో ముద్రింపబడినది.

ప్రాప్తిస్థానము:

P. B. ANNANGARACHARYA,
L. Kancheepuram.

టీకతోడి నాలాయిర దివ్యప్రబంధముల మొత్తము మూల్యము. [illegible] రూ.

1964 జూన్ నెల. 4-00



శ్రీ జగదాచార్య సింహాసనాధిపతులైన
శ్రీ కాంచీ ప్రతివాదిభయంకరమ్
అణ్ణంగరాచార్యులవారు.
(వ్యాఖ్యానవాచస్పతి.)

శ్రీ ర స్తు
ఆళ్వారెమ్బెరుమానార్ జీయర్ తిరువడిగళే శరణమ్.
శ్రీమతే రామానుజాయ నమః.
శ్రీమద్వరవరమునయే నమః.

    

శ్రీమత్కాంచీ ప్రతివాదిభయంకరమ్ అణ్ణంగరాచార్యస్వాములు
కృపచేసిన టీకతోఁకూడిన

# తిరువాయ్ మొழி — షష్ఠశతకము

## ప్రథమదశకము — వైకల్ పూఙ్గழிవాయ్

అవతారిక:—ఆళ్వార్లిట్లనేకవిధంబుల బ్రార్థించియుఁ దన యభీష్టము నొందక దీనికేమి కారణమని యాలోచించి, సర్వేశ్వరుఁడు తిరువణ్ వండూరులో వేంచేసియున్నాడనియు నచ్చటనున్న భోగ్యతావిశేషమందు మగ్నుఁడై తనను మఱచినాఁడనియు నిశ్చయించి మిక్కిలి విరహబాధ ననుభవించుచు సముద్రతీరమందు సంచరించుచుండగా నచ్చట కొన్ని పక్షులనుజూచి, ఓపక్షులారా! మీరు వెళ్ళి తిరువణ్ వండూరులో వేంచేసియున్న శ్రియఃపతివద్ద నాబాధను విన్నవించుడీ యని ప్రార్థించుచున్నారు. ... ... ... *

* వైకల్ పూఙ్గழிవాయ్ వన్దుమేయుఙ్గురుకినఙ్గాళ్ *
శెయ్ కొళ్ శెన్నెలుయర్ తిరువణ్వణ్డూరుఱై యుమ్ *
కైకొళ్ శక్కరత్తు ఎన్ కనివాయ్ ప్పెరుమానైక్కణ్డు *
కైకళ్ కూప్పిచ్చొల్లీర్ వినైయాట్టియేన్ కాదన్మైయే.

వైకల్ పూ కళ్ళి
వాయ్ వన్దు మేయుమ్ కురుకి
నఙ్గాళ్ శెయ్ కొళ్ శెన్నెల్
ఉయర్ తిరువణ్ వణ్డూర్
ఉఱైయుమ్ కైకొళ్ శక్క-
రమ్ ఎన్ కని వాయ్ పెరు
మానై కణ్డు కైకళ్ కూప్పి
విన్నైయాట్టియేన్ కాతనైమ్మ
శొల్లీర్.

ప్రతిదినమును సుందరమైన ఉప్పుకాలువ
యందు వచ్చి మేయుచున్న గుంపుగానున్న ఓ
సారసపక్షులారా! పొలముల నాక్రమించుచున్న
యెఱ్ఱధాన్యము పెరిగియున్న తిరువణ్ వండూరనెడి
దివ్యదేశమందు నిత్యవాసముచేయువాఁడును శ్రీ
హస్తములో స్వీకరింపఁబడిన సుదర్శనముగల
వాఁడును నాస్వామియు దొండపండువలెనున్న
యధరముకలవాఁడు నైన సర్వేశ్వరుని జూచి
చేతులను మొగిడ్చి పాపిష్ఠురాలైన నాయొక్క
యభినివేశమును జెప్పుఁడు.

తా. ఓపక్షులారా! సుదర్శనమును దన శ్రీహస్తమున కాభరణముగా ధరించి మందహాసముఁ జేయుచు నావద్దకువచ్చి తన యధరముయొక్క సౌందర్యముచే నన్ను వశపఱచుకొనిన సర్వేశ్వరుఁ డిప్పుడు తిరువణ్ వండూరికి వెళ్ళి యచ్చటనున్న నిరతిశయభోగ్యతావిశేషమందు మగ్నుఁడై నన్ను మఱచిపోయి యచ్చటనే నిత్యవాసము చేయుచున్నాఁడు. వాని విరహమును నేను సహింపక బలహీనురాలై మిక్కిలి బాధపడుచున్నాను. మీరు నిరంతరముగా నావద్ద వాసముచేయుచున్నారు గాన నాసంబంధమునుబట్టి నాయందు దయయుంచి వాని వద్దకు వెళ్ళి నానిమిత్తమై యంజలిప్రణామములుచేసి నాబాధ వానిమనస్సులోఁ బడునట్లు విన్నవించవలెను. ... ... ... ౧

కాదల్ మెన్ పెడై యోడు ఉడన్ మేయుఙ్గురునారాయ్ *
వేదవేళ్వియొలిముళఙ్గుమ్ తణ్ తిరువణ్వణ్డూర్ *
నాదన్ ఞాలమెల్లాముణ్డ నమ్బెరుమానై క్కణ్డు *
పాదఙ్కైతొళుదుపణియీర్ అడియేన్దిఱమే. ౨

కాతల్ మెన్ పెడై
యోడు ఉడన్ మేయుమ్ కరు
నారాయ్ వేతవొలి వేళ్వి
యొలి ముఴఙ్గుమ్ తణ్ తిరు
వణ్ వణ్డూర్ నాథన్ ఞాల
మెల్లామ్ ఉణ్డ నమ్ పెరు
మానై కణ్డు పాతమ్ కై
తొఴుతు అడియేన్ తిఱమ్
ఫణియార్.

ప్రేమముకలదియు మృదుస్వభావము కల
దియు నైన యాడుపక్షితోఁగూడ మేయుచున్న
శ్యామవర్ణముకల ఓ నారపక్షీ! వేదములయొక్క
శబ్దమును యాగములయొక్క కోలాహలమును
ఘోషించుచున్న చల్లనైన తిరువణ్ వండూరికి
స్వామియు, సకలజగత్తులను మ్రింగినవాఁడు నైన
మనస్వామిని జూచి తిరువడికళ్ళయం దంజలి
చేసి నాయొక్క విధమును జెప్పుఁడు.

తా. తనయందుఁ బ్రీతికల యాడుపక్షితోఁగూడ సంచరించుచున్న ఓ నారపక్షీ! నీవు తిరువణ్ వండూరికి వెళ్ళి యచ్చట వేదఘోషములయందు మగ్నుఁడై యానందించుచున్న, ప్రళయకాలమందు సకలజగత్తును దన యుదరమందుంచుకొని రక్షించిన యాపద్బాంధవుఁడైన సర్వేశ్వరునికి నమస్కరించి నా దుఃఖమును జెప్పుమా. ... ... ... ౨

తిఱఙ్గళాకియెఙ్గుమ్ శెయ్ కళూడుఴల్ పుళ్ళినఙ్గాళ్ *
శిఱన్ద శెల్వమ్మల్కు తిరువణ్వణ్డూరుఱైయుమ్ *
కఱఙ్గుశక్కరక్కైక్కనివాయ్ ప్పెరుమానైక్కణ్డు *
ఇఱఙ్గినీర్ తొఴుదుపణియీర్ అడియేనిడరే. ౩

తిఱఙ్గళాకి ఎఙ్గుమ్
శెయ్ కళూడు ఉఴల్ పుళ్ళి
నఙ్గాళ్ శిఱన్ద శెల్వమ్ మల్కు
తిరువణ్ వణ్డూర్ ఉఱైయుమ్
కఱఙ్గు శక్కరమ్ కై కని
వాయ్ పెరుమానై కణ్డు నీర్

గుంపులుగాఁ జేరి యన్ని దేశములయందలి
పొలములనడుమ సంచరించుచున్న పక్షిసమూ
హములారా! శ్లాఘ్యమైన సంపత్తు వర్ధిల్లుచున్న
తిరువణ్ వండూరులో నిత్యవాసముఁ జేయువాఁడును
చుట్టుతిరుగుచున్న సుదర్శనమును శ్రీహస్తమందు
గలవాఁడును దొండపండువంటి యధరముగల

ఇటజ్గి తొ్ళుతు అడియే్ఱ్ ఇడర్ పణియార్. వాఁడు నైన స్వామిని జూచి మీరు వంగి, యాశ్ర యించి నాయొక్క దుఃఖమును జెప్పుఁడు.

తా. గుంపులుగుంపులుగా పొలములో సంచరించుచున్న ఓపక్షులారా! మీరు సకలసమృద్ధిగల తిరువణ్వండూరులో వేంచేసియున్న చక్రధరునిజూచి కరణత్రయములచే నమ్రులై యుండి నామాటను విన్నవించుడు. ... 3

ఇడరిల్ పోకమ్మూళ్ కి ఇణైన్దాడుమ్మడవన్నజ్గాళ్ *
విడలిల్ వేదవొలిముళ్ఱజ్గుమ్ తణ్ తిరువణ్వణ్డూర్ *
కడల్ మేనిప్పిరా్ఱ్ కణ్ణనై నెడుమాలైక్కణ్డు *
ఉడలమ్నైన్దొరుత్తి ఉరుకుమెన్ఱుణర్త్తుమినే. ४

ఇడర్ ఇల్ భోగమ్ మూళ్ కి ఇణైన్దు ఆడుమ్ మడమ్ అన్నజ్గాళ్ విడల్ ఇల్ వేదవొలి ముళ్ఱజ్గుమ్ తణ్ తిరువణ్వణ్డూర్ కడల్ మేని పిరా్ఱ్ కణ్ణనై నెడు మాలై కణ్డు ఒరుత్తి ఉడ లమ్ నైన్దు ఉరుకుమ్ ఎన్ఱు ఉణర్త్తుమి్ఱ్. విశ్లేష దుఃఖములేని సంభోగమందు మునిగి, చేరియుండి సంచరించుచున్న విధేయము లైన ఓహంసపక్షులారా! విచ్ఛేదము లేక వేద ధ్వని ఘోషించుచున్న చల్లనైన తిరువణ్వండూ రులో వేంచేసియున్నవాఁడును, సముద్రమువంటి కాంతిగలవాఁడును, ఉపకారకుఁడును, ఆశ్రిత సులభుఁడును, మిక్కిలి గొప్పవాఁడు నైన సర్వే శ్వరునిజూచి ఒకతె శరీరము శిథిలమై కరుగు చున్నది అని తెలియజేయుఁడు.

తా. ఆడుపక్షితోఁజేరి యెల్లప్పుఁడును సుఖించుచున్న ఓ హంసపక్షు లారా! తిరువణ్వండూరులో వేదఘోషమునువిని యానందించుచున్న యతి సులభుఁడైన సర్వేశ్వరునొద్దవెళ్ళి, ఒకస్త్రీ నీయందాశచేఁ గరుగుచున్నదని వాని చెవిలోఁ బడవేయుఁడు. ... ... ... ४

ఉణర్తలూడలుణర్న్దు ఉడన్ మేయుమ్మడవన్నఙ్గాళ్ *
తిణర్తవణ్డల్ కళ్ మేల్ శఙ్గు శేరున్దిరువణ్వణ్డూర్ *
పుణర్తపూన్దణ్డుழాయ్ ముడి నమ్బెరుమానై కణ్డు *
పుణర్తకైయినరాయ్ అడియేనుక్కుప్పోత్తుమినే. ౫

ఉణర్తల్ ఊడల్ ఉణర్న్దు ఉడన్ మేయుమ్ మడమ్ అన్నఙ్గాళ్ తిణర్త వణ్డల్ కళ్ మేల్ శఙ్గు శేరుమ్ తిరువణ్ వణ్డూర్ పుణర్త పూ తణ్డుழాయ్ ముడి నమ్ పెరుమానై కణ్డు పుణర్త కైయినరాయ్ అడియేనుక్కుమ్ పోత్తుమిన్.

(ఆడుపక్షి నెడబాసినయెడల యది తన మీద చేయుచున్న) ప్రణయకలహమును, (దాని కోపము శాంతియగునట్లు పలువిధములుగాఁ జెప్పవలసిన) సమాధానమాటలను (నేనెడబాసిన యెడల యీకష్టములు సంభవించునని) తెలిసి కొని, కూడనుండి మేయుచున్న విధేయములైన ఓ హంసపక్షులారా! దట్టమైయున్న యెండిన బుఱదమీఁద శంఖములు చేరియున్న తిరువణ్ వండూరులో వేంచేసియున్నవాఁడును కట్టఁబడిన యందమైన తులసీమాలికలను కిరీటమందు గల వాఁడు నైన మనస్వామిని జూచి మొగిడ్చిన చేతులుగలవారై నాకొఱకై కూడ మంచిమాట లాడి స్తోత్రము చేయుఁడు.

తా. మీమీఁద ప్రణయకలహము చేయుచున్న యాడుపక్షులను సమాధానపఱచి వానితో సుఖించుచున్న ఓహంసపక్షులారా! జలసమృద్ధికల తిరువణ్ వండూరులో వేంచేసియున్న సర్వేశ్వరునొద్ద నన్ననుగ్రహించునట్లు ప్రార్థించుడి.

పోత్తియానిరన్దేన్ పున్నైమేలుఱైపూఙ్గుయిల్ కాళ్ *
శేత్తిల్ వాళైతుళ్లుమ్ తిరువణ్వణ్డూరుఱైయుమ్ *
ఆత్తలాழியఙ్గై అమరర్ పెరుమానై కణ్డు *
మాత్తమొన్ఱు కొణ్డురుళీర్ మైయల్ తీర్వదొరువణ్ణమే. ౬

పునై్న మేల్ ఉఱై
పూ కుయిల్ కాళ్ పోఱ్ఱి
యోఽ్ ఇరన్దేఽ్ శేల్ ఱిల్
వాళై తుళ్ళుమ్ తిరువణ్
వణ్డూర్ ఉఱైయుమ్ ఆఱ్ఱిల్
ఆళ్ళి అమ్ కై అమరర్ పెరు
మానై కణ్డు మైయల్ తీర్వతు
ఒరువణ్ణమ్ మాఱ్ఱమ్ కొణ్డు
అరుళీర్.

పున్న చెట్లమీద నిత్యవాసముఁ జేయుచున్న సుందరమైన ఓ కోకిలములారా! (మిమ్ము లను) స్తుతించి నేను యాచించితిని. (అదేమనగా) బురదప్రదేశములో మత్స్యము లెగురుచున్న తిరువణ్వండూరులో నిత్యవాసముఁ జేయుచున్న వాఁడును దయగల సుదర్శనమును సుందరహస్త మందుఁ గలవాఁడును నిత్యసూరులకు స్వామియు నైన సర్వేశ్వరుని జూచి (నా) భ్రమము తీరు నటుల యొకవిధమైన బదులుమాటను దీసికొని వచ్చి చెప్పుడు.

తా. ఓ కోకిలములారా! మీరు తిరువణ్వండూరులో వేంచేసియున్న దయావంతుఁడైన సర్వేశ్వరునికి నామాటనుజెప్పి దానికి వాఁడు చెప్పెడు బదులు మాటను దీసికొనివచ్చి నాకుచెప్పి నన్ను బ్రదికింపుఁడు. ... ౬

ఒరువణ్ణఞ్జెన్రుపుక్కు ఎనక్కొన్రురై యొణ్ కిళియే *
శెరువొణ్ పూమ్బొళిల్ శూళ్ న్దశెక్కర్ వేలై త్తిరువణ్వణ్డూర్ *
కరువణ్ణఞ్జెయ్యవాయ్ శెయ్యకణ్ శెయ్యకై శెయ్యకాల్ *
శెరువొణ్ శక్కరమ్శఙ్గు అడైయాళ న్తిరున్దక్కన్డే. ౭

ఒణ్ కిళియే శెరు
ఒణ్ పూ పొళిల్ శూళ్
శెక్కర్ వేలై తిరువణ్
వణ్డూర్ ఒరువణ్ణమ్ శెన్రు
పుక్కు కరు వణ్ణమ్ శెయ్య
వాయ్ శెయ్య కణ్ శెయ్య

సుందరమైన ఓచిలకా! (పుష్పములు కోయువారిలో నొకరికొకరికి నేననైదను నేనైదనని) కలహమును బుట్టించునట్టిదియు సుందరంబునైన పుష్పములుగల తోటలచేఁ జుట్టఁబడినదియు (పుష్పములయొక్క ధూళిచేత) ఎఱ్ఱనైన సముద్రముయొక్క గట్టుగలదియు నైన తిరువణ్వండూరులో నొకవిధముగాఁ భోయి

కణ్ శెయ్య కై శెయ్య
కాల్ శెరు ఒణ్ శక్కరమ్
శఙ్గు అడైయాళమ్ తిరున్ద
కణ్డు ఎనక్కు ఒన్ఱు ఉరై.

ప్రవేశించి నీలవర్ణమును, ఎఱ్ఱని యధరమును, రక్తలోచనమును, ఎఱ్ఱని హస్తములును, ఎఱ్ఱని శ్రీపాదములును, యుద్ధోన్ముఖమై సుందరమైన సుదర్శనమును, శ్రీపాంచజన్యమును, (వానికి) చిహ్నములైన వీనిని స్పష్టముగాఁజూచి. నా కొఱకై యొకమాట చెప్పుమా.

తా. ఓచిలకా! తోటలచే నతి రమణీయంబైన తిరువణ్ వండూరికి వెళ్ళి యచ్చటనున్న భోగ్యతాతిశేషమందు మగ్నమై నాకార్యమును మఱచిపోకుండ సర్వేశ్వరునొద్దపోయి వానియొక్క చిహ్నములైన యతి మనోహరములైన దివ్యావయవ దివ్యాయుధములను జూచి వీడే సర్వేశ్వరుండని నిశ్చయించి యచ్చట నామాటను విన్నవింపుమా. ... ... ... ౭

తిరున్దక్కణ్డెనక్కొన్ఱురైయాయ్ ఒణ్ శిఱుపూవాయ్ *
శెరున్దిళాழల్ మగిழ் పున్నైశూழ் తణ్ తిరువణ్వణ్ డూర్ *
పెరున్దణ్ తామరైక్కణ్ పెరునీణ్ముడినాల్ తడన్దోళ్ *
కరున్దిణ్మాముకిల్ పోల్ తిరుమేనియడికళైయే. ౮

ఒణ్ శిఱు పూవాయ్
శెరున్దినాழల్ మకిழ் పున్నై
శూழ் తణ్ తిరువణ్
వండూర్ పెరు తణ్ తామరై
కణ్ పెరు నీళ్ ముడి తడమ్
నాల్ తోళ్ కరు తిణ్ మా
ముకిల్ పోల్ తిరుమేని అడికళై
తిరున్ద కణ్డు ఎనక్కు ఒన్ఱు

అందమైన ఓ చిన్నచిలకా! శెరుంది వృక్షములచేతను ఇరువిడివృక్షములచేతను పొగడ వృక్షములచేతను పున్నవృక్షములచేతను చుట్టఁబడిన చల్లనైన తిరువణ్ వండూరులో వేంచేసియున్న విశాలమై చల్లనైన తామరపుష్పముల వంటి నేత్రములను మిక్కిలి దీర్ఘమైన కిరీటమును విశాలములైన నాల్గుభుజములను శ్యామమై చల్లనైన గొప్పమేఘమువంటి దివ్యవిగ్రహమునుగల

ఉఱైయాయ్. — స్వామిని జక్కగాఁజూచి నావిషయమై యొక మాట చెప్పుము.

తా. ఓ బాలచిలకా! నీ పతిభోగ్యమైన తిరువణ్‌వండూరికి వెళ్లి యచ్చట చతుర్భుజుఁడై కాళమేఘశ్యాముఁడై దీర్ఘములైన నేత్రకిరీటాదులను గలవాఁడై వేంచేసియున్న సర్వేశ్వరుని జూచి నాబాధను జెప్పుమా. ... ౮

అడిక్కళ్ కై తొఴుదు అలర్మేలశై యుమన్నఙ్గాళ్ *
ఇడివై శఙ్గొలిక్కుమ్ తిరువణ్వాణ్ డూరుఱై యుమ్ *
కడియమాయ న్తనై క్కణ్ణనై నెడుమాలై క్కణ్డు *
కొడియవల్వినై యేన్ తిఱఙ్గూఱుమి న్వేఱుకొణ్డే. ౯

అలర్ మేల్ అశై యుమ్ అన్నఙ్గాళ్ ఇడివై శఙ్గు ఒలిక్కుమ్ తిరువణ్ వణ్డూర్ ఉఱైయుమ్ కడియ మాయన్ తనై క్కణ్ణనై నెడు మాలై కణ్డు అడికళ్ కై తొఴుతు కొడియ వల్ వినై యేన్ తిఱమ్ వేఱుకొణ్డు కూఱుమిన్. — పుష్పములమీఁద సంచరించుచున్న ఓ హంసపక్షులారా! ఉదయకాలమునకు సూచకమై శంఖము ఘోషించుచున్న తిరువణ్‌వండూరులో నిత్యవాసముఁ జేయుచున్న (నన్నెడబాసిన) క్రూరుఁడై వంచకుఁడై కృష్ణుఁడై యవతరించిన వాఁడై గొప్ప మహిమగలవాఁడైన సర్వేశ్వరుని జూచి శ్రీపాదములమీఁద నంజలిచేసి మిక్కిలి క్రూరమైన పాపముగల నాయొక్క విధము నేకాంతమందు చెప్పుఁడు.

తా. ఓ హంసపక్షులారా! నాస్థానము నాశ్రయించి వాసముచేయుచున్న మీరు నేనిట్లు నేలమీఁదపడి పొర్లుచు దుఃఖపడుచుండగా మృదువైన పుష్పముల మీఁద సుఖముగ నివసించుట మీకు యుక్తముకాదు గాన మీ రిప్పుడు వెళ్లి నన్నెడబాసి బాధపెట్టుచు తిరువణ్‌వండూరులో వేంచేసియున్న కఠినహృదయము గల వంచకుఁడైన సర్వేశ్వరుని శ్రీపాదములను బట్టుకొని యేకాంతమందుఁ దీసికొనిపోయి నాదుఃఖమును విన్నవించి ప్రార్థించుఁడు. ... ... ౯

వేఱుకొణ్డుమ్మై యానిరన్దేన్ వెఱివణ్డినఙ్గాళ్ *
తేఱునీర్ప్పమ్బై వడపాలై త్తిరువణ్వాణ్డూర్ *
మాఱిల్ పోరరక్కన్ మతిల్ నీఱెழచ్చెఱ్ఱుగన్ద *
ఏఱు శేవకనార్క్కు ఎన్నైయుముళళెన్మిన్గళే. ౧౦

వెఱి వణ్డినఙ్గాళ్ ఉమ్మై వేఱుకొణ్డు యాన్ ఇరన్దేన్ తేఱు నీర్ పమ్బై వడపాలై తిరువణ్ వండూర్ మాఱు ఇల్ పోర్ అరక్కన్ మతిల్ నీఱు ఎழ శెఱ్ఱు ఉకన్ద ఏఱు శేవకనార్క్కు ఎన్నైయుమ్ ఉళళ్ ఎన్మిన్గళ్.

పరిమళించుచున్న గుంపుగానున్న ఓ తుమ్మెదలారా! మిమ్ములను విలక్షణములుగా నెంచి నేను యాచించితిని. నిర్మలమైన జలముగల పంపానదియొక్క ఉత్తరతీరమందున్న తిరువణ్ వండూరులో వేంచేసియున్నవాఁడును, ఒప్పులేని యుద్ధముగల రావణాసురునియొక్క కోటను భస్మమగునట్లు నశింపఁజేసి సంతోషించినవాఁడును, వర్ధిల్లుచున్న శౌర్యముగలవాఁడు నైన సర్వేశ్వరునికి (నిరత్న్యకోటియం దీమెకూడ యొకతె) ఉన్నదని నన్నును విన్నవించుడి.

తా. ఓ తుమ్మెదలారా ! మీతోఁ జెప్పినయెడల నాకార్యము శీఘ్రముగా సిద్ధించునని మిమ్ములను వేడుకొనియెద. మీరు వెళ్లి పంపానది కుత్తరమందున్న తిరువణ్ వండూరులో వేంచేసియున్న గొప్ప పరాక్రమవంతుఁడైన సర్వేశ్వరునొద్ద నీ రత్న్యకోటిలోఁ జేరిన యీామె యి ట్లనస్థపడుచున్నదని నన్ను విన్నవించుడి.౧౦

* మిన్గొళ్ శేర్ పురినూల్ కుఱళాయ్ అకల్ ఞాలఙ్గొణ్డ *
వన్ కళ్వనడిమేల్ కురుకూర్చ్చడకోపన్ శొన్న *
పణ్గొళాయిరత్తుళ్ళివై పత్తుమ్ తిరువణ్వాణ్డూర్క్కు *
ఇన్గొళ్ పాడల్ వల్లార్ మదనర్ మిన్నిడై యవర్క్కే. ౧౧

మిన్ కొళ్ శేర్ పురి నూల్ కుఱళాయ్ అకల్

కాంతిగలదై తిరుమేనుతోఁ జేరియున్న యజ్ఞోపవీతముగల వామనబ్రహ్మచారియై విశాల

ఘాలమ్కొణ్డ వన్ కళ్వన్ అడి
మేల్ కురుకూర్చ్ డ కోవన్
శొన్న పణ్ కొళ్ ఆయిర
త్తుళ్ తిరువణ్ వండూర్క్కు
ఇన్ కొళ్ పాడల్ ఇవై పత్తుమ్
వల్లార్ మిన్ ఇడై యవర్క్కు
మతనర్.

మైన భూమిని స్వీకరించిన మహానంచకుఁడైన సర్వేశ్వరునియొక్క శ్రీపాదముల విషయమై కురుకాపురాధీసులైన నమ్మాళ్వార్ల ప్రసాదించిన గానముగల వేయిపాశురములలో తిరువణ్ వండూరువిషయమై మధురములై పాశురరూపము లైన యీపదిగాథల నభ్యసించువారు మెఱుపు వలె ప్రకాశించుచున్న నడుముగలస్త్రీలకు మన్మథునివలె శ్రీవైష్ణవులకు భోగ్యభూతులై యుందురు.

తా. వామనావతారంబెత్తి మహాబలియొద్దనుండి భూమిని స్వాధీనపఱుచుకొనినట్లు తమయొక్క ప్రణయరోషజనితదుర్మానమును బోఁగొట్టిన సర్వేశ్వరుఁడు వేంచేసియున్న తిరువణ్ వండూర్ విషయమై నమ్మాళ్వార్లు ప్రసాదించిన యీ పదిపాశురముల నభ్యసించువారు శ్రీవైష్ణవుల కానందమును గలుగఁజేయుదురు.

షష్ఠశతకములో ప్రథమదశకము ముగిసెను.
ఆళ్వార్ ఎమ్బెరుమానార్ జీయర్ తిరువడికళే శరణమ్.



తిరువాయ్ మొళ్ళి – షష్ఠశతకములో

## ద్వితీయదశకము — మిన్నిడైమడవార్

అవతారిక:—ఆళ్వార్లుపంపిన పక్షులుపోయి సర్వేశ్వరునికి విన్నవింప, తరువాత నాసర్వేశ్వరుఁడు కొంచెము విలంబించివచ్చెను. అంతమాత్రము విరహమును సహింపని యాళ్వార్లనెడి నాయిక తనయొద్దవచ్చిన సర్వేశ్వరునిమీదఁ బ్రణయరోషముచేసి నీవిచ్చట రావలదు; మీకిష్టమైన స్త్రీలవద్ద వెళ్ళవచ్చునని తిరస్కరింప నప్పుడాసర్వేశ్వరుఁడు వీరిని మంచిమాటలాడుచున్నాఁడని సాధించుచున్నారు. ... ... ... ...

* మిన్నిడై మడవార్ గళ్ నిన్నరుళ్ శూడువార్ మున్బునాన దఞ్జువన్ *
మన్నుడై యిలఙ్గై అరణ్ కాయ్ న్దమాయవనే *
ఉన్నుడైయ శుణ్డాయమ్ నానఱివన్ ఇనియదుకొణ్డు శెయ్ వదెన్ *
ఎన్నుడైయపన్దుమ్ కళలుమ్ తన్దుపోగునమ్బీ. ౧

మిన్ ఇడై మడవార్ కళ్ నిన్ అరుళ్ శూడువార్ మున్బు నాన్ అదు అఞ్జువన్; మన్నుడై యిలఙ్గైయరణ్గాయ్ న్ద మాయవనే! ఉన్నుడైయ శుణ్డాయమ్ నాన్ అఱివన్ ఇని అదు కొణ్డు శెయ్ వదు ఎన్? నమ్బీ ఎన్నుడైయ పన్దుమ్ కళలుమ్ తన్దు పోగు.

మెఱుపువలె ప్రకాశించుచున్న నడుము గలవారై వినయసంపన్నులై నీయొక్క దయను ధరించువారైన (నీ ప్రీతివిషయులైన) స్త్రీల యొక్క ముందఱ (నాబంతిని తీసికొనుట మంచిది కాదు). అట్లుచేసినయెడల వారు నిన్ను తిరస్కారముఁ జేయుదురు). నేను వారుచేసెడి నీతిరస్కారమును (జూచి) భయపడుదును. సమర్థుఁడైన రాజుచేఁ బరిపాలింపఁబడిన లంకయొక్క కోటను నశింపఁజేసిన వంచకుఁడా! నీయొక్కవంచనను నే నెఱుఁగుదును. ఇఁకను ఆకపటమును (నాయందు) బ్రకటనచేసి చేయఁదగిన దేమున్నది? పూర్ణుఁడా! నాయొక్క బంతిని గచ్చకాయను నిచ్చి పో.

తా. సర్వేశ్వరుఁడు వచ్చినప్పు డాళ్వార్లనెడి నాయిక మాటలాడక వాని మీదఁ గోపగించియున్నప్పుడు, వాఁడు వీరియొక్కబంతిని దీసికొనెను. వానిని జూచి ఓయి! నీవిదేమి చేయుచున్నావు? నీకిష్టురాలైన స్త్రీలు దీనిని జూచిన యెడల నాయందు నీవు వ్యామోహపడియున్నావని తలఁచి నీతో వారు సంశ్లేషింపరు. అప్పుడు నీ వనుభవించెడి దుఃఖమునుజూచి నేను సహింపఁజాలను. ఏకదారవ్రతుఁడనైన నాకు నీవుతప్ప వేఱుస్త్రీ కాదాయని యావంచనమాటలు నాతోఁ జెప్పవలదు. ఆవ్రతముగూడ స్త్రీలకు నీయందు నమ్మకముబుట్టించుకొని పిమ్మట

వారిని స్వాధీనపఱచుకొనుటకై య్యే చేసితివిగాని యథార్థముగాఁ జేయలేదు. నీ కపటము నాకుఁ దెలుసునుగాన నావద్ద నీకౌటిల్య మేమియు ఫలించదు; నాబంతి నిచ్చి నీ కిష్టమయినవారియొద్ద వెళ్ళవచ్చును. ... ... ౧

పోకునమ్బియున్తామరై పురై కణ్ణిణై యుమ్ శెవ్వాయ్ ముఱువలుమ్ *
ఆకులఙ్గళ్ శెయ్య అళ్ళిదత్తేనోమ్ ఙ్గళ్ మేయామ్ *
తోకై మామయిలార్ కళ్ నిన్నరుళ్ శూడువార్ శెవియోశైవైత్తెழ *
ఆకళ్ పోగవిట్టు క్కుழలూరుపోయిరున్దే. ౨

నమ్బి పోక; ఉన్ తామరై పురై కణ్ణిణై యుమ్ శెవ్వాయ్ ముఱువలుమ్ యామ్ ఆకులఙ్గళ్ శెయ్య అళ్ళిదత్తుక్కనోమ్ ఙ్గళ్ మే; తోకై మా మయిలార్ కళ్ నిన్ అరుళ్ శూడువార్ ఓశై శెవివైత్తు ఎழ ఆకళ్ పోకవిట్టు పోయ్ ఇరున్దు కుழల్ ఊతు.

ఓపూర్ణుఁడా! పో. నీయొక్క పద్మములోఁ బోలిన నేత్రములును, ఎఱ్ఱనైన యధరమందు నిలసిల్లుచున్న చిఱునవ్వును, మేము (ఉన్నవిధమును) వ్యాకులపఱచగా నశించుటకై యే తపంబు జేసినవారమైతిమి. నెమలిపింఛమువలె శ్లాఘ్యమైన కేశపాశముగలస్త్రీలు నీదయను ధరించుదురు (నీదయకు విషయమగుదురు). (వారు) (వేణు)నాదమును చెవిలోవిని లేచివచ్చునట్లు గోవులను దూరముగాఁబోనిచ్చి (నీవు) వెళ్ళి (వారిసమీపమందు) ఉండి వేణువు నూదుము.

తా. ఓయి! నీయొక్క పద్మనేత్రమును, ఎఱ్ఱని యధరముమీదఁ బ్రసరించుచున్న తెల్లని మందహాసమును భాగ్యహీనురాలైన నన్ను మిక్కిలి బాధించుచున్నవి గాన నాకంటిముందఱనుండి యవతల వెళ్లుమా యని చెప్పి యాళ్వార్లు ముఖమును వెనుకతిప్పుకొనిరి. అప్పుడు సర్వేశ్వరుఁడు చూచి కేశసౌందర్యము ననుభవించి దానిని స్తోత్రముచేయ నారంభించగా, ఓయి! నీ వెవరి కొప్పునితలంచి మోహించితివో యది కాదిది. నీ వచ్చుటికే వెళ్ళుము. అని యాళ్వార్లు చెప్పిన మాటనువిని వాఁడు, వా రెచ్చటనున్నారు? నేను వారి నెట్లు

లభించెదనని యడిగెను. దానికి యాశ్వార్లు, నీవు దూరముగాబోవుచున్న యావులను బిలుచునట్లు వేణునాదముఁ జేసినయెడల దానిని విని వారే నీదగ్గఱవచ్చి చేరుదురని చెప్పుచున్నారు. ... ... ... 3

పోయిరున్దునిన్ పుళ్ళువమఱియాదవర్క్కు ఉరైనమ్బీ * నిన్ శెయ్య
వాయిరుక్కనియుఙ్కణ్గళుమ్ విపరీతమిన్నాళ్ *
వేయిరున్దడన్దోళినార్ ఇత్తిరువరుళ్ పెఱువార్ యవర్కొల్ *
మాయిరుఙ్గడలైక్కడైన్ద పెరుమానాలే 3

నమ్బీ! పోయ్ ఇరున్దు నిన్ పుళ్ళువమ్ అఱియాతవర్క్కు ఉరై; నిన్ శెయ్య వాయ్ ఇరు కనియుమ్ కణ్గళుమ్ ఇన్నాళ్ విపరీతమ్; మా ఇరు కడలై క్కడైన్ద పెరుమానాలే ఇత్తిరు అరుళ్ పెఱువార్ వేయ్ ఇరుతడమ్ తోళినార్ యవర్కొల్.

ఓ పూర్ణుఁడా! (వారున్నచోటికి) పోయియుండి నీయొక్క కపటమునెఱుఁగని యాస్త్రీలకు (నాతోఁజెప్పెడి మాటను) జెప్పుము. నీయొక్క ఎఱ్ఱనైన యధరమనెడి పక్వమైన పండును నేత్రములు నీదినములలో విజాతీయములైయున్నవి. అగాధమై విశాలమైన సముద్రమును జిలికిన గొప్పవాఁడవైన నీచేత నిట్టి శ్లాఘ్యమైన దయను బొందఁదగినవారై వెదురువలె బలిసియు పొడవుగానున్న భుజములుగలవారైన స్త్రీలు ఎవరోః

తా. నేను వేణునాదముఁజేయుట స్వాభావికమేగాని స్త్రీలను బిలుచుటకై చేయనని సర్వేశ్వరుఁడు చెప్పగా, ఓయి! నీకపటస్వభావము నెఱుఁగనివారియొద్ద నీమాట చెప్పితివేని వారు నమ్ముదురుగాని నేనీమాటను నమ్మను. నీ వెవరిమీద మోహపడి నీశరీర మిట్లొడిపోవుచున్నవో ? అట్టి భాగ్యవంతులైన సుందరాంగులెవరో తెలియలేదు. ... ... ... 3

ఆలినీళిలై వళ్ళులగముణ్డు అన్దునీకిడన్దాయ్ * ఉన్ మాయఙ్గళ్
మేలైవానవరుమఱియార్ ఇనియెమ్బరమే *

వేలినేర్ తడఙ్గణ్ణినార్ విళైయాడు శూழలై చ్చూழవేనిన్ఱు *
కాలిమేయ్క్కవల్లాయ్ ఎమ్మైనీకழఱేలే. ౮

పేழులకుమ్ ఉణ్డు ఆలిలై నీల్ ఇలై అన్ఱు నీ కిడన్దాయ్ ఉన్ మాయఙ్గళ్ మేలై వాన వరుమ్ అఱియార్ ఇని ఎమ్ పరమే! వేలినేర్ తడమ్ కణ్ణినార్ విళైయాడు శూழలై శూழ నిన్ఱే కాలి మేయ్క్క వల్లాయ్ ఎమ్మై నీ కழఱేల్.

సప్తలోకములను మ్రింగి మఱ్ఱిచెట్టుయొక్క పొడుగైన యాకుమీఁద నా ప్రళయకాలమందు నీవు పవ్వళించితివి. నీయొక్క యాశ్చర్యచేష్టితములను, ఉత్కృష్టులైన నిత్యసూరులును తెలిసికొనఁజాలరు. ఇఁక మీఁద నాకు తెలిసికొనుటకు సాధ్యమగునా! ధనుస్సుతో సమానమై విశాలమైన నేత్రములుగలస్త్రీలు క్రీడించుచున్న యిసుకదిబ్బను జుట్టుకొనియుండియే యావులను మేపినవాఁడా! మమ్ములను నీవు క్రూరమాటలను జెప్పవలదు.

తా. నేను తల్లిదండ్రులమాటలనువిని యావులను మేపుటకుఁ బోయియుంటిని. అందువలన నే నిచ్చటికి యాలస్యమైవచ్చితిని. దానికొఱకై మీరు కోపగింపఁగూడదు. నేను వఱియొకస్త్రీని యెఱుఁగనని సర్వేశ్వరుఁ డనగా; ఓయి! సప్తలోకముల నారగించి యొక చిన్నవటదళమందుఁ బవ్వళించిన యఘటితఘటనాసమర్థుఁడవైన నీమాయలు సర్వజ్ఞులైన నిత్యసూరులకుఁగూడ నెఱుఁగ సాధ్యములుకావు అట్టివానిని యజ్ఞుఁడనైన నే నెఱుఁగుదునా? నీ వావులను మేపుటకుఁ బోయినయెడల స్త్రీలు క్రీడించుచున్నచోటుదక్క నీకు వేఱెచ్చటను చోటుచిక్కలేదా? గాన యిట్టి యబద్ధపుమాటలనుజెప్పి మమ్ములను బాధపెట్టవలదు వెళ్లుమాయని చెప్పుచున్నారు. ... ... ౮

కழఱేల్ నమ్బి ఉన్కైదవఙ్గణ్ణుమ్ ఎణ్ణుమ్ నన్గఱియుమ్ * తిణ్ శక్కర
నిழలుతొల్ పడైయాయ్ ఉనక్కొన్ఱుణర్వన్నాన్ *
మழలై తేన్మొழియార్ కళ్ నిన్నరుళ్ శూడువార్ మనమ్వాడినిక్క*ఎమ్
కుழలుపూవైయొడుమ్ కిళియోడుమ్కుழగేలే, ౯

నన్బి కழுదేల్ ఇన్ శక్కరమ్ నిழுలు తోల్ పడై యాయ్ ఉన్ కైతవమ్ మణ్ణుమ్ విణ్ణుమ్ నన్గు అఱి యుమ్; ఉనక్కు నాన్ ఒన్ఱు ఉణరత్తువన్; నిన్ అరుళ్ శూడువార్ మழுలు తేన్ మొழிయార్ కళ్ మనమ్వాడి నిఱ్క ఎమ్ కుழுలు పూవై యొడుమ్ కిళియోడుమ్ కుழு కేల్.

ఓపూర్ణుఁడా! అసత్యమాటలతో నన్ను బాధింపవలదు. దృఢమైన సుదర్శనమనెడి తేజస్సును బ్రసరింపఁజేయుచున్న యనాదియైన ఆయుధముగలవాఁడా! నీయొక్క కృత్రిమము ను భూలోకమందుండువారును, ఊర్ధ్వలోకములయందుండువారును జక్కగా నెఱుంగుదురు. నీకు నేనొకమాట బోధించెద (వినుము). నీయొక్క దయను ధరించువారును నవీనమైన తేనెవలె భోగ్యమైన మాటలుకలవారు నైన స్త్రీలు హృదయము శిథిలమైయుండగా మాయొక్క యక్షరము తెలియకుండ మాటలాడుచున్న చిన్నచిలకతోను పెద్దచిలకతోను గ్రీడింపకుమా?

తా. ఓయి! నేను సత్యసంధుఁడనని యసత్యవాక్యములనుజెప్పి నన్ను బాధపెట్టవలదు. నీకపటము నెఱుఁగుదురు. దానికి దినమును రాత్రిగాఁజేసిన నీ సుదర్శనమే సాక్షి. నీ కొకమాటచెప్పెదను వినుము. నీకుఁ బ్రియురాళ్లైన స్త్రీలు చూచుచుండగా నాచిలుకతో మాటలాడితివేని వారు నొచ్చుకొనుదురు గాన నిప్పుడు నాచిలకను విడిచిపెట్టి వెళ్లుము. ... ... 2

కుழுగియెజ్గళ్ కుழுమణన్గొణ్డు కోయిన్మై శెయ్దు కన్నమొన్ఱిల్లై *
పழுగియామిరుప్పోమ్ పరమేయిత్తిరువరుళ్ గళ్ *
అழுగియారివ్వులగుమూన్ఱుక్కుమ్ తేవిమైతగువార్ పలరుళర్ *
కழுగమేఱేల్ నమ్బి ఉనక్కుమిళై దేకన్నమే.

3

కుழுకి ఎజ్గళ్ కుழு మణన్ కొణ్డు కోయిన్మై శెయ్తు ఒన్ఱు కన్నమ్ ఇల్లై;

శృంగారవిలాసమును జేసికొనిపోయి మాయొక్క బొమ్మను దీసికొనివచ్చి యక్రమవ్యాపారములను జేసి యొక ప్రయోజనమును లేదు,

యామ్ పఌ్రకి ఇరుప్పోమ్; ఇ త్తిరు అరుళ్ కళ్ పరమే? అఌ్రకియార్ ఇ ఉలకుమూన్డు క్కుమ్ తేవిమై తకువార్ పలర్ ఉళర్; నమ్బి కఌ్రకమ్ ఏ జేల్; ఉనక్కుమ్ కన్మమ్ ఇళై తు.

మేము (నీతో) సహవాసముఁ జేసియున్నాము. ఇట్టి విలక్షణములైన (నీ) కృపావ్యాపారములకు (మేము) విషయభూతులమా? సుందరులై యీ లోకములు మూడింటికిని పట్టమహిషీస్థానమునకు యోగ్యురాళ్లైనవా రనేకులున్నారు. ఓపూర్ణుఁడా! (మా) సమూహమందెక్కి ప్రవేశింపవలదు. నీకును (ఈ) వ్యాపారము పిల్ల చేష్టలై యుండును.

తా. ఓయి! మందహాసాదులచే మమ్ములను మోహపెట్టి మాబొమ్మను దీసికొనుటచే నీకేమియు ప్రయోజనములేదు. నీసంగతి యిదివఱకే మాకుఁదెలు సును. ఈపరిహాసములు నీపట్టమహిషులతోఁ జేయఁదగినవి గాని మాతోఁ జేయ రాదు. మాగుంపులోఁ బ్రవేశించుట మీకు యుక్తముకాదు; వెళ్లుము. ౬

కన్మమన్జెగళ్ కై యిఱ్పావై పఱిప్పదు కడల్ ఞాలముణ్డిట్ట *
నిన్మలానెడియాయ్ ఉనక్కేలుమ్పిఱైప్పిఱైయే *
వన్మమేశొల్లి యెమ్మైనీవిళై యాడుది అదుకేట్కిలెనై మార్ *
తన్మపావమెన్నార్ ఒరునాన్డుతడిపిణక్కే. ౭

ఎఙ్గళ్ కై యిల్ పావై పఱిప్పతు కన్మమ్ అన్డు; కడల్ ఞాలమ్ ఉణ్డిట్ట నిన్మలా నెడియాయ్ ఉనక్కుమ్ పిఱై పిఱైయే; నీ వన్మమ్ ఎమ్మై శొల్లి విళై యాడుతి; ఎ ఐమార్ అతు కేట్కిల్ తన్మ పావమ్ ఎన్నార్; ఒరునాన్డు తడి పిణక్కు ఆమ్.

మాయొక్క చేతిలోనున్న బొమ్మనపహరించుట మంచిపనికాదు. సముద్రముచేఁ జుట్టఁబడిన భూమిని యారగించిన పరిశుద్ధుఁడా! గొప్పవాఁడా! నీకును తప్పు తప్పే. నీవు మర్మములను మమ్ములనుద్దేశించి చెప్పి యాడుచున్నావు. నా సహోదరులామాటలను వినినయెడల ధర్మము పాపము అని విచారించరు. ఒకదినము కఱ్ఱనెత్తికొని కలహించునట్లగును.

తా. ఓయి! మాచేతిలోనున్న బొమ్మను దీసికొనుట మీకు యుక్తము కాదు. నీ వెంతవాఁడవైనను నీవుచేసెడి యీయన్యాయము లెన్నటికిని న్యాయములు కానేరవు. మాతో రహస్యమాటలను నీవు చెప్పుచుండగా మాయన్న తమ్ములు వినినయెడల యేమియు విచారింపక కట్టినుదీసికొని తన్నుదురు. ౭

పిణక్కి-యావైయుమ్‌యావరుమ్ పి[?]ఱైయామల్ పేదిత్తుమ్ పేదియాదదోర్ *
కణక్కిల్ కీర్తివెళ్ళ క్కదిర్ ఞానమూర్తియినాయ్ *
ఇణక్కి-యెమ్మైయెన్దోழிమార్ విళైయాడప్పోదుమినెన్నప్పోన్దోమై *
ఉణక్కి-నీవళైత్తాల్ ఎన్ శొల్లారుగవాదవరే. ౮

యావరుమ్ యావైయుమ్ పిణక్కి పిఱైయామల్ భేదిత్తుమ్ భేదియాతతు ఓర్ కణక్కిల్ కీర్త్తి వెళ్ళమ్ కతిర్ ఞానమ్ మూర్తియినాయ్! ఎమ్ తోழிమార్ ఎమ్మైఇణక్కి విళైయాడ పోతుమిన ఎన్న పోన్దోమై ఉణక్కి నీ వళైత్తాల్ ఉకవాతవర్ ఎన్ శొల్లార్.

సకలచేతనులనున్ను సమస్తాచేతనములనున్ను (ప్రళయకాలమందు) తనయందుఁ జేర్చుకొని యొకరి కర్మఫలము మఱియొకరికి మాఱిపోకుండ (వారివారి కర్మానుగుణముగా) సృజించియు నాకర్మములచే నీ వసంస్పృష్టుఁడవైయుండి యద్వితీయమై యసంఖ్యేయమైన కీర్తిసముద్రము గలవాఁడవై (అపరిచ్ఛిన్న కీర్తి గలవాఁడవై) ప్రకాశించుచున్న జ్ఞానమును స్వరూపముగాఁ గలవాఁడా! మాసఖియలు మమ్ములను (మాకు) వనవిహారమం దాశనుగలుగఁజేసి విహరించెదము రమ్మ అని చెప్పుటచే వచ్చిన మమ్ములను నీవు నిర్బంధపఱచి యడ్డగించితివేని దీనిని సహింపని వారు ఏమి యపవాదమును జెప్పరు.

తా. సకల చేతనాచేతనములకును సృష్టి సంహారకర్తయని కీర్తిగలవాఁడవై నిర్మలజ్ఞానస్వరూపుఁడవైన నీవిప్పుడు మమ్మును దోవలో నడ్డగించు

చున్నావుగదా. దీనిని నీస్త్రీలు చూచినయెడల నీయందు దోషముల నారోపించి నీకీర్తిని నశింపఁజేయుదురు. ... ... ... ౮

ఉకవైయాల్ నెఞ్జముళ్ళురుగి ఉన్దామరై త్తడఙ్గణ్విఴిగళిన్ *
అకవలైప్పడుప్పాన్ అழித్తాయున్తిరువడియాల్ *
తకవుశెయ్దిలై యెఙ్గళ్ శిఱ్రిలుమ్ యామడుశిఱుశోఱుఙ్గణ్డు * నిన్
ముకవొళితికழ ముఱువల్ శెయ్దునిన్ఱిలై యే. ౯

ఉకవైయాల్ నెఞ్జమ్ ఉళ్ళురుకి ఉన్ తామరై తడమ్ కణ్ విழிకళ్ వలైయిన్ అకప్పడుప్పాన్ ఎఙ్గళ్ శిఱ్రిలుమ్ యామ్ అడు శిఱుశోఱుమ్ కణ్డు నిన్ ముకమ్ ఒళి తికழ ముఱువల్ శెయ్తు నిన్ఱిలై; ఉన్ తిరువడియాల్ అழித్తాయ్; తకవు శెయ్తిలై.

ప్రీతిచే హృదయముకలిగి నీయొక్క తామర పువ్వువలె విశాలమైన నేత్రములయొక్క చూపులనెడి వలయందుఁ దొటికించుకొనుటకై మాయొక్క (ఇసుకతో విహారార్థమైచేసిన) చిన్నగృహమును మేము తళిక చేసిన చిన్నప్రసాదమునుజూచి నీముఖమందు కాంతి ప్రకాశించునట్లు మందహాసముచేసి నిలువక నీ శ్రీపాదములచేఁ జెడగొట్టితివి. దయచేయకపోతివి.

తా. ఓయి! మేము నిన్నుజూచునట్లును, అప్పుడు నీకటాక్షముచే మమ్మును వశపఱచుకొనుటకును, దానిచే మేము సంతోషించుటకు నుపాయ మేమని యోచించి, ఇసుకలను బోగుచేసి మేమాడుకున్న యాటలనుజూచి సంతోషింపక నిర్దయుఁడవై చెడగొట్టితివి; ఇది నీకు మంచిదికాదు. ... ౯

నిన్ఱిలఙ్గుముడియినాయ్ ఇరుపత్తోర్ కాలరశుకళైకట్ట *
వెన్ఱినీళ్ మழுవా వియన్ ఞాలమున్పడైత్తాయ్ *
ఇన్ఱివ్వాయర్ కులత్తైవీడుయ్యత్తోన్ఱియకరుమాణిక్కచ్చుడర్ *
విన్ఱన్నాల్ నలివేపడుహోమెన్ఱుమ్ ఆయ్చ్చియోమే. ౧౦

నిన్ఱు ఇలఙ్గు ముడియి
నాయ్ ఇరుపత్తోర్ కాల్
అరశు కళైకట్ట వెన్ఱి నీళ్
మఴువా! వియల్ ఞాలమ్
ముఴు పడైత్తాయ్! ఇన్ఱు ఇ
ఆయర్ కులమ్ వీడు ఉయ్య
త్తోన్ఱియ కరుమాణిక్కచ్చు
డర్ నిన్ఱన్నాల్ ఆయ్చ్చి
యోమ్ ఎన్ఱుమ్ నలివు పడు
వోమే.

నిలిచి ప్రకాశించుచున్న కిరీటముగల వాఁడా! ఇరువదియొక పురుషము రాజులను నిర్మూలముఁ జేసి జయముగల పొడుగైన గొడ్డలిగలవాఁడా! విశాలమైన భూమిని మునుపు సృజించినవాఁడా! ఇప్పుడు, ఈ గోపకులమును సంపూర్ణముగ నుజ్జీవింపించుటకై యవతరించిన నీలమాణిక్యమువంటి కాంతిగలవాఁడా! సచేత గోపికలైన మే మెల్లప్పుఁడు నుపద్రవమునే పొందుచున్నాము.

తా. ఈవిధంబుగ నీ శౌర్యకారుణ్య వాత్సల్యాదిగుణములచే మమ్మును వశపఱచుకొని వెనుక మాతో విశ్లేషించి యీవిశ్లేషదుఃఖ మెఱుఁగక నీ వెల్లప్పుఁడును బాధపెట్టుచున్నావు. ... ... ... ౧౦

ఆయ్చ్చియాగియవన్నైయాల్ అన్ఱువెణ్ణెయ్ వార్తైయుళ్ * శీఱ్ఱముణ్డఴు
కూత్తవప్పన్ఱనై క్కురుకూర్చ్చడకోపన్ *
ఏత్తియతమిఴ్మాలై ఆయిరత్తుళ్ళివైయుమోర్ పత్తిశైయొడుమ్ *
నాత్తన్నాల్ నవిలవురైప్పార్క్కు ఇల్లైనల్కురవే. ౧౧

ఆయ్చ్చి యాకియ
అన్నైయాల్ అన్ఱు వెణ్ణెయ్
వార్తైయుళ్ శీఱ్ఱ ముణ్డు
అఴుకూత్త అప్పన్ తన్నై
కురుకూర్చ్చడకోపన్ ఏత్తి
య తమిఴ్మాలై ఆయిర
త్తుళ్ళుమ్ ఇవై యోర్ పత్తుమ్

గోపికయై తల్లియైన యశోదాదేవిచే నప్పుడు వీడు నవనీతమును దొంగిలించెనని మాట వచ్చినప్పుడు కోపగింపఁబడి యేడ్చుచు నృత్యముఁ జేయునట్లాడుచున్న స్వామియైన శ్రీకృష్ణునివిషయమై కురుకాపురికి స్వామియైన నమ్మాళ్వార్లు స్తోత్రముఁ జేసిన ద్రావిడశబ్దసందర్భరూపములైన వేయిపాశురములలో నద్వితీయములైన యీపది

ఇశైయొడు నాత్తన్నాల్ పాశురములను స్వరముతోఁగూడ నాలికచే నాద
నవిల ఉఱైప్పార్కు నల్ రముతో ననుసంధించువారికి భగవదలాభమనెడి
కురవు ఇల్లై. దారిద్ర్యము రానేరాదు.

తా. ఆశ్రితసులభుఁడైన శ్రీకృష్ణునివిషయమై నమ్మాழ్వార్లు ప్రసాదించిన యీ పదిపాశురముల నాదరముతో ననుసంధించువారు భగవద్గుణములను నిరంతరముగా ననుభవింతురు. ... ... ... ౧౧

షష్ఠశతకములో ద్వితీయదశకము ముగిసెను.

ఆழ్వార్ ఎమ్బెరుమానార్ జీయర్ తిరువడికళే శరణమ్.

---

తిరువాయ్ మొழి – షష్ఠశతకములో

## తృతీయదశకము — నల్ కురవుమ్

అవతారిక:—ఇట్లు తమతో సంశ్లేషించిన సర్వేశ్వరునియొక్క అఘటితఘటనాసామర్థ్యముల ననుభవించిన నమ్మాழ్వార్లు భక్తులకు సేవసాదించుటకై తిరువిణ్ణకరిలోవచ్చి వేంచేసియున్న సర్వేశ్వరునియొక్క అఘటితఘటనాసామర్థ్య గుణముల ననుభవించి యాగుణముల నుపపాదించుచున్నారు. ... *

* నల్కురవుమ్ శెల్వుమ్ నరకుమ్శువర్క్కముమాయ్ *
వెల్పకైయుమ్నట్పుమ్ విడముమముదముమాయ్ *
పల్వగైయుమ్పరన్ద పెరుమానెన్నైయాళ్వానై *
శెల్వమ్మల్కుకుడి త్తిరువిణ్ణకర్ కణ్డేనే. ౧

నల్కురవుమ్ శెల్వుమ్ దారిద్ర్యమును సంపత్తును నరకమును
నరకుమ్ శువర్క్కము స్వర్గమును విభూతిగాఁగలవాఁడై, జయించు
మాయ్ వెల్ పకైయుమ్ చున్న ద్వేషమును స్నేహమును విషమును

నట్టుమ్ విడముమ్ అముతము మాయ్ పల్ వకైయుమ్ పరన్ద పెరుమాన్ ఎన్నై ఆళ్వానై శెల్వమ్ మల్కు కుడి తిరువి ణ్ణకర్ కణ్డేన్.

అమృతమును విభూతిగాఁగలవాఁడై, (విభూతి ద్వారా ఇట్లు) అనేకవిధములుగా వ్యాపించియున్న స్వామియై, నన్ను దాసునిగాఁ జేసికొనిన సర్వేశ్వరుని సంపత్తు అతిశయించియున్న (సజ్జన) కుటుంబముగల తిరువిణ్ణకరనెడి దివ్యదేశమందు సేవించితిని.

తా. పరస్పరవిరుద్ధములైన దారిద్ర్యము మొదలగు చెడ్డవస్తువులను, సంపత్తు మొదలగు మంచివస్తువులను విభూతిగాఁగల సర్వవ్యాపియైన సర్వేశ్వరుని తిరువిణ్ణకరిలో ననుభవించితిని. ... ... ... ౧

కణ్డవిన్బమ్తున్బమ్ కలక్కఙ్గళుమ్ తేఱ్ఱముమాయ్ *
తణ్డముమ్తణ్మైయుమ్ తழలుమ్నిழలుమాయ్ *
కణ్డుకొళ్ దఱ్కరియ పెరుమాన్ ఎన్నైయాళ్వానూర్ *
తెణ్డిరైప్పునల్ శూழ் తిరువిణ్ణగర్ నన్నగరే. ౨

కణ్డ ఇన్బన్దున్బమ్ కల క్కఙ్గళుమ్ తేఱ్ఱము మాయ్ దణ్డముమ్ తణ్మై యుమ్ తழలుమ్ నిழలు మాయ్ కణ్డుకొళ్ త ఱ్ఱు అరియ పెరుమాన్ ఎన్నై ఆళ్వాన్ ఊర్ తెణ్ తిరై పునల్ శూழ் తిరువిణ్ణకర్ నల్ నకర్.

ప్రత్యక్షసిద్ధములైన సుఖదుఃఖములను (ఇష్టము లభింపకఁబోవుటచేఁ గలిగిన) మనోవికారమును (అది లభించుటచేతఁ గలిగిన) మనోనైర్మల్యమును విభూతిగాఁగలవాఁడును, క్షోపమును, అనుగ్రహమును (ఉష్ణమైన) అగ్నిని (చల్లనైన) నీడను విభూతిగాఁగలవాఁడును, తెలిసికొనుటకు దుర్లభుఁడును సర్వాధికుఁడును నన్ను దాసునిగాఁ జేసికొనినవాఁడునైన సర్వేశ్వరునికి వాసయోగ్యమైన దేశము, నిర్మలమై అలలు కొట్టుచున్న జలముచేఁ జుట్టఁబడిన తిరువిణ్ణకరనెడి శ్లాఘ్యమైన పట్టణము.

తా. సుఖదుఃఖాదులను కోపానుగ్రహాదులను విభూతిగాగల సర్వేశ్వరుఁడు నాకు సేవసాదించుటకై విరజానదితో సమానమైన నదిచేతఁ జుట్టఁబడినదై పరమపదముతో సమానమైన తిరువిణ్ణకరిలో వేంచేసియున్నాఁడు. ... ౨

నగరముమ్నాడుగళుమ్ ఞానముమూడముమాయ్ *
నిగరిల్ శూళ్ శుడరాయిరుళాయ్ నిలనాయ్విశుమ్బాయ్ *
శిగరమాడజ్గళ్ శూళ్ తిరువిణ్ణగర్ చ్చేర్ న్దపిరాన *
పుగర్కొళ్ కీర్ త్తియల్లాలిల్లై యావర్క్కుమ్పుణ్ణియమే. 3

నగరముమ్ నాడుకళుమ్ ఞానముమ్ మూడముమాయ్ నికర్ ఇల్ శూళ్ శుడరాయ్ ఇరుళాయ్ నిలనాయ్ విశుమ్బాయ్ శికరమ్ మాడజ్గళ్ శూళ్ తిరువిణ్ణకర్ శేర్న్దపిరాన పుకర్ కొళ్ కీర్త్తి అల్లాల్ యావర్క్కుమ్ పుణ్ణియమ్ ఇల్లై.

పట్టణమును దేశములను జ్ఞానము నజ్ఞానమును విభూతిగాఁగలవాఁడై ఒప్పు లేనిదై వ్యాపించియున్న ప్రకాశమును విభూతిగాఁగలవాఁడై యంధకారమును విభూతిగాఁగలవాఁడై భూమిని విభూతిగాఁగలవాఁడై యాకసమును విభూతిగాఁగలవాఁడై పర్వతశిఖరమువలెనున్న గృహములచే వ్యాప్తమైయున్న తిరువిణ్ణకరిలో నమరి వేంచేసియున్నవాఁడైన సర్వేశ్వరుని యొక్క ఔజ్జ్వల్యముగల కీర్తితప్ప సమస్తచేతనులకు నుజ్జీవనహేతువు లేదు.

తా. జ్ఞానాజ్ఞానములను ప్రకాశాప్రకాశములను భూమ్యంతరిక్షములను విభూతిగాఁగలవాఁడై తిరువిణ్ణకరిలో వేంచేసియున్న శ్రియఃపతియొక్క గుణానుసంధానమే సమస్తప్రాణులకు నుజ్జీవనహేతువు. ... ... 3

పుణ్ణియమ్పావమ్ పుణర్చ్చిపిరివెన్ఱివై యాయ్ *
ఎణ్ణమాయ్మఱప్పాయుణ్మైయాయ్ ఇన్మైయాయ్యల్లనాయ్ *
తిణ్ణమాడజ్గళ్ శూళ్ తిరువిణ్ణకర్ చ్చేర్న్దపిరాన *
కణ్ణనిన్నరుళే కణ్డుకొణ్మిన్కళ్ కైదవమే, ౪

పుణ్ణియమ్‌పావమ్ పుణర్‌చ్చిపిరివు ఎన్ఱు ఇవై యాయ్ ఎణ్ణమాయ్ మఱప్పాయ్ ఉణ్మైయాయిన్మైయాయ్ అల్లనాయ్ తిణ్ణమ్ మాడఙ్గళ్ శూழ் తిరువిణ్ణకర్ శేర్న్ద పిరాన్ కణ్ణన్ ఇన్ అరుళే కణ్డుకొణ్మిన్గళ్ కైతవమే.

పుణ్యపాపములు (అనుకూల) సంశ్లేషవిశ్లేషము లనెడి వీనిని విభూతిగాఁగలవాఁడును స్మరణమును విభూతిగాఁగలవాఁడును విస్మరణమును విభూతిగాఁగలవాఁడును సదసత్పదార్థములను విభూతిగాఁగలవాఁడును తద్గతదోషరహితుఁడును దృఢములైన మేడలచేఁ జుట్టఁబడిన తిరువిణ్ణకర్‌లో నిత్యవాసముఁజేయుచున్న ఉపకారకుఁడునైన శ్రీకృష్ణునియొక్క భోగ్యమైన (నిర్హేతుక) కృపయే (చేతనోజ్జీవనకారణము) (శాస్త్రమందు) చూడుఁడు. ఇది యబద్ధమగునా? (కాదు).

తా. పుణ్యపాపములను, తత్కార్యంబులైన యనుకూల సంశ్లేష విశ్లేషములను, తదధీనమైన యనుకూలస్మరణ ప్రతికూలవిస్మరణములను, సకల చేతనాచేతనములను విభూతిగాఁగలవాఁడై, దోషగంధరహితుఁడై యతిరమణీయంబైన తిరువిణ్ణకరిలో వేంచేసియున్న శ్రియఃపతియొక్క నిర్హేతుకకృపయే యందఱికి నుజ్జీవనకారణము. ఇందులో సందేహములేదు. ఈమాటను శాస్త్రమందు విచారించుఁడు. ... ... ... ... ౧

కైదవమ్ శెమ్మై కరుమై వెళుమైయుమాయ్ *
మెయ్ పొయ్యిళమై ముదుమైపుదుమైపழமైయుమాయ్ *
శెయ్ దతిణ్ మదిళ్ శూழ் తిరువిణ్ణగర్ చ్చేర్న్దపిరాన్ *
పెయ్ దకావుకణ్డీర్ పెరున్దేవుడై మూవులగే. ౨

కైతవమ్ శెమ్మై కరుమై వెళుమైయుమాయ్ మెయ్ పొయ్ ఇళమైముతుమై పుతుమై పழమైయు

కపటము నార్జవమును నలుపును తెలుపును విభూతిగాఁగలవాఁడై సత్యాసత్యములను బాల్యవార్ధక్యములను నవీనప్రాచీనములను విభూతిగాఁగలవాఁడై (చక్కగా) నిర్మింపఁబడిన దృఢ

మాయ్ శెయ్త తిణ్ మతిళ్ శూళ్ తిరువిణ్ణకర్ శేర్న్ద పిరాన్ పెయ్త కావుకణ్డీర్ పెరున్దేవుడై మూవులకు.

మైన ప్రాకారముచే నావరింపఁబడిన తిరువిణ్ణకరిలోఁ జేరియున్న సర్వేశ్వరుఁడు వేసిన తోఁట సుమండీ, బ్రహ్మాది గొప్పదేవతలుగల మూఁడు లోకములును.

తా. మనోవాక్కాయములయొక్క యుత్కృష్టనికృష్టరూపములైన స్వభావము లన్నిఁటిని విభూతిగాఁ గలవాఁడై తిరువిణ్ణకర్‌లో వేంచేసియున్న సర్వేశ్వరునికి యీ చరాచరాత్మకంబులైన లోకములు లీలార్థమై నిర్మింపఁబడినవి. ౫

మూవులకఙ్గళుమాయ్ అల్లనాయుగప్పాయ్ మునివాయ్ *
పూవిల్ వాళ్ మగళాయ్ త్తవ్వైయాయ్ప్పుకళ్ళాయ్ప్పళియాయ్ *
తేవర్ మేవిత్తొళుమ్ తిరువిణ్ణగర్ చ్చేర్న్దపిరాన్ *
పావియేన మనత్తే ఉఱైగిన్ఱ పరఞ్జుడరే. ౬

మూవులకఙ్గళుమాయ్ అల్లనాయ్ ఉకప్పాయ్ మునివాయ్ పూవిల్ వాళ్ మకళాయ్ తౌవ్వైయాయ్ పుకళ్ళాయ్ పళియాయ్ దేవర్ మేవి తొళుమ్ తిరువిణ్ణకర్ శేర్న్ద పిరాన్ పావియేన మనత్తే ఉఱైకిన్ఱ పరఞ్జుడర్.

మూఁడులోకములను విభూతిగాఁగలవాఁడును, అంతకంటె వేఱైన నిత్యవిభూతిని విభూతిగాఁగలవాఁడును, అనుగ్రహమును విభూతిగాఁ గలవాఁడును నిగ్రహమును విభూతిగాఁగలవాఁడును, తామరసపుష్పమందు నిత్యవాసముఁ జేయుచున్న శ్రీమహాలక్ష్మిని విభూతిగాఁగలవాఁడును, జ్యేష్ఠాదేవిని విభూతిగాఁగలవాఁడును, కీర్తిని విభూతిగాఁగలవాఁడును, అపవాదమును విభూతిగాఁగలవాఁడును, నిత్యసూరులువచ్చి యాశ్రయించుచున్న తిరువిణ్ణకరిలో వాసముఁ జేయుచున్నవాఁడు నైన సర్వేశ్వరుఁడు పాపినైన నాయొక్క మనస్సులో నమరి వేంచేసియున్న పరంజ్యోతిస్వరూపుఁడు.

తా. త్రిలోకములను నిగ్రహానుగ్రహములను శ్రీమహాలక్ష్మిని పెద్దమ్మను స్తుతినిందలను విభూతిగాఁగలవాఁడై, నిత్యసూరిసంసేవ్యుఁడై తిరువిణ్ణకర్ లో వేంచేసియున్న శ్రియఃపతి నామనస్సులో వేంచేసియుండి విలసిల్లుచున్నాఁడు. ౬

పరఞ్జుడరుడమ్బాయ్ అழுక్కుప్పది త్తవుడమ్బాయ్ *
కరన్దుమ్తోన్ఱియుమ్నిన్ఱుమ్ కై దవఙ్గళ్ శెయ్ దుమ్ * విణ్ణోర్
శిరఙ్గళాల్ వణఙ్గుమ్ తిరువిణ్ణగర్ శేర్ న్దపిరాన్ *
వరఙ్గొళ్ పాదమల్లాలిల్లై యావర్ క్కుమ్వన్ శరణే. ౭

పరఞ్జుడరుడమ్బాయ్ అழுక్కు పతి త్త ఉడమ్బాయ్ కరన్దుమ్ తోన్ఱియుమ్ నిన్ఱుమ్ కై తవఙ్గళ్ శెయ్ తుమ్ విణ్ణోర్ శిరఙ్గళాల్ వణఙ్గుమ్ తిరువిణ్ణకర్ శేర్న్ద పిరాన్ వరమ్ కొళ్ పాతమ్ అల్లాల్ యావర్ క్కుమ్ వన్ శరణ్ ఇల్లై.

మిక్కిలి తేజోరూపమైన యప్రాకృత దివ్యవిగ్రహము గలవాఁడును, దోషములచేఁ బూర్ణమైన లీలావిభూతిని శరీరముగాఁగలవాఁడును, అంతర్యామియై మఱిగియుండియు రామ కృష్ణాదిరూపములుగా నవతరించియు (ఈలోకమందు) నివసించియు కపటవ్యాపారములను జేసియున్నవాఁడును, నిత్యసూరులు శిరస్సులచే నమస్కరించుచున్న తిరువిణ్ణకరిలో వచ్చి వేంచేసియున్నవాఁడు నైన సర్వేశ్వరుని యొక్క శ్రైష్ఠ్యముగల శ్రీపాదములు తప్ప సమస్తచేతనులకును దృఢమైన యుపాయములేదు.

తా. అప్రాకృత దివ్యవిగ్రహాయుతుఁడును సకల జగచ్ఛరీరుఁడును సమస్త ప్రాణులకు నంతర్యామియైయుండియు రామకృష్ణాద్యవతారములనెత్తియు రక్షించుచు, ఆశ్రితులకు సులభుఁడై యనాశ్రితులకు దుర్లభుడై తిరువిణ్ణకరిలో వేంచేసియున్న శ్రియఃపతియొక్క శ్రీపాదమే చేతను లుజ్జీవించుటకు శ్రేష్ఠమైన ఉపాయము. ... ... ... ... ౭

వన్ శరణ్ శురర్ కాయ్ అశురర్ క్కు వెఙ్గూర్ ఱముమాయ్ *
తన్ శరణ్ నిఴల్కీఴ్ ఉలగమ్ వైత్తుమ్ వైయాదుమ్ *
తెన్ శరణ్ తిశైక్కు త్తిరువిణ్ణగర్ చ్చేర్ న్దపిరాన్ *
ఎన్ శరణ్ కణ్ణన్ ఎన్నై న్నయాళుడై యెన్నప్పనే. ౮

శురర్ క్కు వన్ శర — దేవతలకు దృఢమైన రక్షకుఁడై యసురు
ణాయ్ అశురర్ క్కు వెమ్ — లకు క్రూరమైన మృత్యువై యాశ్రితులను దన
కూర్ ఱముమాయ్ ఉలకమ్ — యొక్క శ్రీపాదముయొక్క నీడక్రిందనుంచియు
తన్ శరణ్ నిఴల్కీఴ్ వైత్తుమ్ — (అభక్తులను తన శ్రీపాదఛాయయందు) ఉంచని
వైయాతుమ్ తెన్ దిశైక్కు — వాఁడును దక్షిణదిక్కుకు రక్షయైయున్న తిరువి
శరణ్ తిరువిణ్ణకర్ శేర్ న్ద — ణ్ణకరిలోఁ జేరియున్న ఉపకారకుఁడును నా
పిరాన్ ఎన్ కణ్ణన్ ఎన్నై న్న — కత్యంత సులభుఁడును నన్ను దాసునిగాఁ గల
ఆళుడై ఎన్నప్పన్ ఎన్ — వాఁడునైన నాస్వామి నాకు రక్షకుఁడు.
శరణ్.

తా. భక్తులను దన శ్రీపాదములక్రింద నుంచుకొని రక్షించువాఁడును, అభక్తులను నశింపఁజేయువాఁడును, నా కత్యంతసులభుఁడునై తిరువిణ్ణకరిలో వేంచేసియున్న సర్వేశ్వరుఁడే నాకు రక్షకుఁడు. ... ... ౮

ఎన్నప్పనెనక్కాయ్ ఇగుళాయెన్నై న్నపెత్ఱవళాయ్ *
పొన్నప్పన్ మణియప్పన్ ముత్తప్పనెన్నప్పనుమాయ్ *
మిన్నప్పొన్మదిళ్ శూఴ్ తిరువిణ్ణగర్ చ్చేర్ న్దవప్పన్ *
తన్నొప్పారిల్లప్పన్ తన్దనన్ తనతాళ్ నిఴలే. ౯

ఎనక్కు ఎన్ అప్ప — నా కసాధారణుఁడై నాకు తండ్రియై
నాయ్ ఇకుళాయ్ ఎన్నై న్న — సఖియై కనినతల్లియై బంగారమువంటివాఁడై
పెత్ఱవళాయ్ పొన్నప్పన్ — రత్నమువంటివాఁడై ముత్యమువంటివాఁడై నా
మణియప్పన్ ముత్తప్పన్ — స్వామియునై మెఱుపువలె ప్రకాశించుచున్న

| | |
|---|---|
| ఎన్నప్పనుమాయ్ మిన్న శ్శా మతిళ్ శూழ் తిరువి ణ్ణకర్ శేర్న్ద అప్పన్ తన్ ఒప్పార్ ఇల్ అప్పన్ తన తాళ్ నిழల్ తన్దనన్. | స్వర్ణప్రాకారముచేఁ జుట్టఁబడిన తిరువిణ్ణకరిలో నిత్యవాసముఁ జేయుచున్న సర్వస్వామియై తనతో సాటిలేని ఉపకారకుఁడైన శ్రియఃపతి తన శ్రీపాదముయొక్క ఛాయను (నాకు) ఇచ్చెను. |

తా. నాకు సకలవిధబంధువై యత్యంతభోగ్యభూతుఁడై, అతి రమణీయమైన తిరువిణ్ణకరిలో వేంచేసియున్న యసదృశుఁడైన శ్రియఃపతి నన్ను తన శ్రీపాదములక్రిందఁ జేర్చుకొనెను. ... ... ... ౯

నిழల్ వెయ్యిల్ శిఱుమై పెరుమై కుఱుమై నెడుమైయుమాయ్ *
శుழల్ వననిఱ్పన మఱ్ఱుమాయ్ అవై యల్లనుమాయ్ *
మழలై వాయ్ వణ్డువాழ் తిరువిణ్ణగర్ మన్ను పిరాన్ *
కழల్ గళన్ఱి మఱ్ఱోర్ కళై గణిలమ్ కాణ్ మిన్ గళే. ౧౦

| | |
|---|---|
| నిழల్ వెయ్యిల్ శిఱుమై పెరుమై కుఱుమై నెడుమైయుమాయ్ శుழల్వన నిఱ్పన మఱ్ఱుమాయ్ అవై అల్లనుమాయ్ మழలై వాయ్ వణ్డు వాழ் తిరువి ణ్ణకర్ మన్ను పిరాన్ కழల్ కళ్ అన్ఱి మఱ్ఱు ఓర్ కళై కణ్ ఇలమ్ కాణ్మిన్గళ్. | ఛాయాస్వరూపుఁడై యాతపస్వరూపుఁడై యణుస్వరూపుఁడై మహత్స్వరూపుఁడై హ్రస్వరూపుఁడై దీర్ఘరూపుఁడై జంగమస్వరూపుఁడై స్థావరస్వరూపుఁడై తక్కినపదార్థ స్వరూపుఁడై యాపదార్థములయొక్క స్వభావము లేనివాఁడై ముద్దుమాటలుగల తుమ్మెదలు సంచరించుచున్న తిరువిణ్ణకరిలో నిత్యవాసముఁ జేయుచున్న సర్వేశ్వరునియొక్క శ్రీపాదములు తప్ప వేఱొక రక్షకుని గలవారముకాము; విచారించుడి. |

తా. అణుబృహద్ధ్రస్వదీర్ఘ ఛాయాతప చరాచరాది సకల పదార్థములను విభూతిగాఁగలవాఁడై తిరువిణ్ణకరిలో వేంచేసియున్న శ్రియఃపతియొక్క శ్రీపాదములకంటె మనకు వేఱురక్షకము లేదు. ... ... ౧౧

* కాణ్మిన్గళులగీరెన్టు కణ్ముగప్పేనిమిర్న్ద *
తాళినైయన్తనై న్కురుగూర్చ్చడకోపన్ శొన్న *
ఆనైయాయిరత్తు త్తిరువిణ్ణగర్ పత్తుమ్వల్లార్ *
కోనైయిన్టివిణ్ణోర్కు ఎన్టుమావర్కురవర్గళే. ౧౧

ఉలకీర్ కాణ్మిన్గళ్ ఎన్టు కణ్ముకప్పే నిమిర్న్ద తాళినైయన్తనై న్కురుకూర్ శడకోపన్ శొన్న ఆనై ఆయిరత్తు తిరువిణ్ణకర్ పత్తుమ్ వల్లార్ కోనై ఇన్టి విణ్ణోర్కు ఎన్టుమ్ కురవర్కళ్ ఆవర్.

ఓ లోకులారా! చూడుఁడు అనిచెప్పి వారికంటిముందఱనే పొడవైన శ్రీపాదద్వంద్వము గల శ్రియఃపతివిషయమై తిరునగరికి స్వామియైన నమ్మాళ్వార్లు సాదించిన భగవదాజ్ఞారూపము లైన వేయిపాశురములలో తిరువిణ్ణకరనెడి దివ్య దేశవిషయమైన పదిపాశురముల నభ్యసించు వారు సంశయములేక నిత్యసూరుల కెల్లప్పుఁడును పూజ్యు లగుదురు.

తా. తిరువిణ్ణకరిలో వేంచేసియున్న శ్రియఃపతివిషయమై నమ్మాళ్వార్లు ప్రసాదించిన యీ పదిపాశురముల నభ్యసించువారిని నిత్యసూరులు పూజింతురు. ఇందుకు సందేహములేదు. ... ... ... ౧౧

షష్ఠశతకములో తృతీయదశకము ముగిసెను.

ఆళ్వార్ ఎమ్బెరుమానార్ జీయర్ తిరువడికళే శరణమ్.



# చతుర్థదశకము — కురవైయాయ్చ్చియర్

అవతారిక:—శ్రీకృష్ణచేష్టితానుభవజనిత ప్రీతివిశేషమునకు పరీవాహరూపమైన దశకమిది. ... ... ... *

* కురవై యాయ్ చ్చియరోడుకో_త్తదుమ్ కున్ఱ మొన్ఱేన్దియదుమ్ *
ఉరవునీర్ ప్పొయ్ గై నాగమ్ కాయ్ న్దదుమ్ ఉట్ పడమఱ్ ఱుమ్పల *
అరవిల్ పళ్ళిప్పిరా_న్ఱన్ మాయవినై గళై యేయలఱ్ఱి *
ఇరవునన్ పగలుమ్ తవిర్ గిలమ్ ఎన్నకుఱై నమక్కే. ౧

ఆయ్ చ్చియరోడు కురవై కోత్తతుమ్ ఒన్ఱు కున్ఱమ్ ఏన్దియతుమ్ ఉరవు నీర్ పొయ్ కై నాకమ్ కాయ్ న్దతుమ్ ఉట్పడ మఱ్ ఱుమ్ పల అరవిల్ పళ్ళి పిరాన్ తన్ మాయమ్ వినైకళై యే అలఱ్ఱి నల్ ఇరవుమ్ పకలుమ్ తవిర్ కిలమ్ నమక్కు ఎన్న కుఱై (ఉణ్డు)

గోపికలతోఁగూడ రాసక్రీడయందు (చేతులను) జోడించుకొనినదియు ఒక (గోవర్ధన) పర్వతమును ధరించినదియు విషముతోఁగూడుకొనిన జలముగల మడుగునందున్న కాళింగుని గోపగించినదియు నివి మొదలుగా నింక ననేకములైయాదిశేషునిమీఁదఁ బవ్వళించిన సర్వేశ్వరుని యొక్క యాశ్చర్యకరంబులైన చేష్టితంబులను సంతోషముతోఁ జెప్పి భగవద్గుణానుభవయోగ్యమైన రాత్రియందును దినమందును నెడతెగక ననుసంధించుచున్న మన కేమి కొఱత? (ఉన్నది).

తా. శ్రీకృష్ణునియొక్క రాసక్రీడా గోవర్ధనోద్ధరణ కాళీయమర్దనాద్యత్యాశ్చర్య చేష్టితములను రేయింబగ ళ్లనుసంధించుచున్న మన కింక నేవిధమైన కొఱఁతయు లేదు. ... ... ... ... ౧

కేయ త్తీఞ్కుழలూదిన్ఱుమ్నిఱై మేయ్ త్తతుఙ్గణ్ణైయొణ్ కణ్ *
వాళపుప్పాజ్గుழల్ పిన్నై తోళ్ గళ్ మణన్దదుమ్మన్ఱుమ్పల *
మాయక్కోలప్పిరాన్తన శెయ్ కై నినైన్దు మనమ్కుழైన్దు *
నేయత్తోడుకழిన్దపోతు ఎనక్కెవ్వులకమ్నికరే. ౧

గేయమ్ తీమ్ కుழల్ ఊతిన్ఱుమ్ నిఱై మేయ్ త్తతుమ్ శెణ్ణై ఒణ్ కణ్ వాశమ్ పూ కుழల్ పిన్నై తోళ్ కళ్ మణన్దతుమ్ మన్ఱుమ్ పల మాయక్కోలమ్ పిరాన్ తన శెయ్ కై నినైన్దు మనమ్ కుழైన్దు నేయత్తోడు పోతు కழిన్ద ఎనక్కు ఎవ్వుల కమ్ నికర్ (ఆవతు).

గానముచే సుఖకరమైన వేణువు నూదినదియు, గోసమూహమును మేపినదియు, మత్స్యమువలె సుందరమైన నేత్రముగలదియు పరిమళించుచున్న పుష్పముగల కొప్పుగలదియునైన నప్పిన్నపిరాట్టియొక్క భుజములతో సంశ్లేషించినదియు (ఇవిమొదలై) ఇట్ల ననేకవిధములైన యాశ్చర్యరూపముగల శ్రీకృష్ణునియొక్క చేష్టితములను దలంచి మనస్సు కరిగి ప్రీతితో కాలముగడుచుచున్నది. నా కేలోకమందైనను ఒప్పు (కలరా?)

తా. వేణునాదముఁ జేయుచు నావులను మేపినది, నప్పిన్నపిరాట్టితో సంశ్లేషించినది మొదలగు శ్రీకృష్ణచేష్టితముల ననుసంధించి యెల్లప్పుడు నానందించుచున్న నాకు నొప్పైనవా రెవ్వరు లేరు. ... ... ౧

నికరిల్ మల్లరైచ్చెన్ఱతుమ్ నిరై మేయ్ త్తదుమ్నీళెదుజ్గై *
శిగరమాకళిఱట్టతుమ్ ఇవై పోల్వనవుమ్పలవుమ్ *
పుకర్ కొళ్ శోతిప్పిరాన్తన శెయ్ కై నినైన్దుపులమ్బియెన్ఱుమ్ *
నుకరవైకల్ వైకప్పెఱ్ఱేన్ ఎనక్కెన్నినినోవతువే. 3

నికర్ ఇల్ మల్లరై శెన్ఱతుమ్ నిరై మేయ్ త్త

ఒప్పులేని (యుద్ధమం దసదృశులైన) చాణూరముష్టికు లనెడి మల్లులను చంపినదియు,

తుమ్ నీల్ నెడుమ్ కై శిక
రమ్ మా కళిఱు అట్టతుమ్
ఇవై పోల్వనవుమ్ పిఱవుమ్
పుకర్ కొళ్ శోది పిరాన్ తన్
శెయ్ కై నినైన్దు పులమ్బి
ఎన్ఱుమ్ నుకర వైకల్ వైక
పెఱ్ఱేన్ ఇని ఎనక్కు ఎన్
నోవతు.

ఆవులను మేపినదియు, ఉన్నతమై దీర్ఘమైన తొండముగల పర్వతశిఖరమువలెనున్న గొప్ప కువలయాపీడమును నశింపఁజేసినదియు వీనితో సమానములైన తక్కినవియునైన యత్యుజ్జ్వలమైన తేజస్సుగల శ్రీకృష్ణునియొక్క చేష్టితములను ధ్యానించి చెప్పెడువిధమును తప్పి యనుసంధించి యెల్లప్పుడు నాయనుభవముతోడనే కాలమంతయు గడుచునట్లు లభించితిని. ఇఁకమీఁద దేనినిగుఱించి దుఃఖపడవలసినది ?

తా. మల్లయుద్ధము, కువలయాపీడసంహారము మొదలగు శ్రీకృష్ణుని దివ్య చేష్టితముల నెల్లప్పుడు ననుసంధించుటకుఁ దగిన భాగ్యముగల నేనిఁక చింతింపఁ దగిన దేమియు లేదు. ... ... ... 3

నోవవాయ్చ్చియురలోడార్క్క ఇరఙ్గిఱ్ఱుమ్వఞ్జప్పెణ్ణై *
శావప్పాలుణ్డతుమ్ ఊర్ శకడమిఱచ్చాడియతుమ్ *
తేవక్కోలప్పిరాన్ఱన్ శెయ్ కై నినైన్దు మనఙ్కుఴైన్దు *
మేవక్కాలఙ్గళ్ కూడినేన్ ఎనక్కెన్నినివేణ్డువతే. ౪

నోవ ఆచ్చి ఉరలోడు
ఆర్క్క ఇరఙ్గిఱ్ఱుమ్ వఞ్జమ్
పెణ్ణై శావ పాల్ ఉణ్డతుమ్
ఊర్ శకడమ్ ఇఱచ్చాడియ
తుమ్ తేవక్కోలమ్ పిరాన్
తన్ శెయ్ కై నినైన్దు మనమ్
కుఴైన్దు మేవ కాలఙ్గళ్ కూ

నొచ్చునట్లు యశోదాదేవి రోలుతోఁ జేర్చి కట్టగా (దానికి) భయపడియుండినదియు వంచకియైన పూతన చచ్చునట్లు స్తన్యమును ద్రాగినదియు పైకి దొర్లివచ్చిన శకటాసురుని నశించునట్లు తన్నినదియు నైన అప్రాకృతదివ్యవిగ్రహముగల శ్రీకృష్ణునియొక్క చేష్టితములను ధ్యానించి హృదయము కరిగి (ఈచేష్టితములలో

డిర్నే ఎనక్కు ఇని వేణ్డు పతు ఎన్ ? మనస్సు) చేరునట్లు, కాలములతోఁ జేరియుండునట్లు లభించితిని. నాకు ఇఁకమీఁద నేమి కావలసినది ?

తా. యశోదాదేవి రోలుతోఁ జేర్చి కట్టినప్పుడు దానికిలోపడి యశక్తుని వలె భయపడినది, పూతనా శకటాసురులను సంహరించినది మొదలగు శ్రీకృష్ణుని వ్యాపారములను ధ్యానింపఁదగిన భాగ్యముకల నాకిఁక నేమియు నక్కఱలేదు. ౮

వేణ్డిత్తేవరిరక్కవన్దుపిఱన్దతుమ్ వీఙ్గిరుళ్ వాయ్
పూణ్డు * అన్ఱన్నై పులమ్బప్పోయ్ అఙ్గోరాయ్ క్కులమ్పుక్కతుమ్ *
కాణ్డలిన్ఱివళర్న్దు కఞ్జనై త్తుఞ్జవఞ్జమ్ శెయ్ తతుమ్ *
ఈణ్డునానలత్ తప్పెత్తేన్ ఎనక్కెన్నవికలుళ తే. ౯

తేవర్ ఇరక్క వేణ్డి వన్దు పిఱన్దతుమ్ అన్ఱు అన్నై పూణ్డు పులమ్బ వీఙ్గు ఇరుళ్ వాయ్ పోయ్ అఙ్గు ఓర్ ఆయ్ క్కులమ్ పుక్కతుమ్ కాణ్డల్ ఇన్ఱి వళర్న్దు కఞ్జన్ తుఞ్జ వఞ్జమ్ శెయ్ తతుమ్ ఈణ్డు నాళ్ అలత్త పెత్తేన్ ఎ న క్కు ఎన్న ఇకల్ ఉళతు.

దేవతలు ప్రార్థింప (అప్పుడు తన) ఇచ్ఛచే వచ్చి యవతరించినదియు, అప్పుడు తల్లియైన దేవకీదేవి (తిరువడికళను) కట్టుకొని యేడవగా వర్ధిల్లుచున్న చీకటియందు (గోకులమునకు) వెళ్ళి యచ్చట నద్వితీయమైన గొల్లకులమందుఁ బ్రవేశించినదియు, (కంసునికి) నేత్రవిషయము కాకుండ పెరిగి కంసుని నశించునట్లు వంచన చేసినదియు, (ఈ చేష్టితములను) ఇచ్చటనున్న నే ననుసంధింప లభించితిని. నాకేమి దుఃఖముకలదు ?

తా. బ్రహ్మాదుల ప్రార్థనల నంగీకరించి దేవకీగర్భమం దవతరించి అచ్చట కంసునికి భయపడిన దేవకీమనోరథ ప్రకారముగా గోకులమునకువెళ్ళి నందగోప గృహమందుఁ బెరిగి, పిమ్మట కంసుని సంహరించిన శ్రీకృష్ణుని దివ్యచేష్టితముల ననుసంధించుచున్న నాకేవిధ దుఃఖమును లేదు. ... ... ౯

Funding: Tattva Heritage and IKS-MoE. Digitization: eGangotri.



ఇకల్ కొళ్ పుళ్లైప్పిళన్దతుమ్ ఇమిలేఱుకళ్ శెత్తతువుమ్ *
ఉయర్ కొళ్ శోలై కురున్దొశిత్తతుమ్ ఉట్పడమత్తుమ్పల *
అకల్ కొళ్ వైయమళన్దమాయఙ్ఙళ్ ఎన్నప్పన్తన్ మాయఙ్గళే *
పకలిరాప్పరవప్పెత్తేన్ ఎనక్కెన్న మనప్పరిప్పే. ౬

ఇకల్ కొళ్ పుళ్లై పిళన్దతుమ్ ఇమిల్ ఏఱుకళ్ శెత్తతువుమ్ ఉయర్ కొళ్ శోలై కురున్దు ఒశిత్తతుమ్ ఉట్పడ మత్తుమ్ పల అకల్ కొళ్ వైయమ్ అళన్ద మాయన్ ఎన్ అప్పన్ తన్ మాయఙ్గళ్ పకలిరా పరవ పెత్తేన్ ఎనక్కు ఎన్న మన ప్పరిప్పు (ఉణ్డు.) యుద్ధమునకువచ్చిన బకాసురుని జీల్చినదియు మూపురముగల వృషభములను జంపినదియు ఉన్నతమై శాఖాదులచే సమృద్ధమైయున్న బండి గురుగింజవృక్షమును విఱిచినదియు, ఇవి మొదలుగాఁగల ఇఁక ననేకములై విశాలమైన భూమిని గొలిచిన ఆశ్చర్యభూతుఁడై నాకు సేవసాదించిన స్వామియొక్క ఆశ్చర్యకరంబులైన చేష్టితములను దినమందును రాత్రియందును స్తుతించునట్లు లభించితిని. నాకు ఏమి మనోదుఃఖము (కలదు ?)

తా. బకాసురుని, యేడువృషభములను జంపుట, కుందవృక్షమును బడఁద్రోయుట ఇవి మొదలగు శ్రీకృష్ణచరిత్రముల నెల్లప్పుఁ డనుసంధించుచున్న నాకేవిధ మనోదుఃఖమును లేదు. ... ... ... ౬

మనప్పరిప్పోడళుక్కుమానిడశాతియిల్ తాన్పిఱన్దు *
తనక్కు వేణ్డురుక్కొణ్డు తాన్తనశీర్ ఱత్తినై ముడిక్కుమ్ *
పునత్తుழாయ్ ముడిమాలైమార్పన్ ఎన్నప్పన్తన్ మాయఙ్గళే *
నినైక్కుమ్ నెఞ్జుడైయేన్ ఎనక్కినియార్ నికర్ నీణిలత్తే. ౭

మనమ్ పరిప్పోడు అళుక్కు మానిడశాతియిల్ (భక్తుఃలు కష్టమునసుభవించుచున్నారని) మనఃక్లేశముతోఁగూడ హేయమైన మనుష్య

తాన్ పిఱన్దు తనక్కు వేణ్డు ఉరుక్కొణ్డు తాన్ తన శీత్తత్తినై ముడిక్కుమ్ పునమ్ తుఴాయ్ మాలై ముడి తుఴాయ్ మాలై మార్పన్ ఎన్ అప్పన్ తన్ మాయఙ్గళ్ నినైక్కుమ్ నెఞ్జు ఉడైయేన్ ఎనక్కు ఇని నీళ్ నిలత్తు సికర్ ఆర్.

జాతియందు తా నవతరించి తన కభిమతమైన అప్రాకృతవిగ్రహమును స్వీకరించి తానే తనకోపమును దీర్చుకొనినవాఁడును తనస్థానమందున్నట్లు వలె (సుందరమై) ఉన్న తులసీమాలికలుగల కిరీటమును ఆతిరుత్తుఴాయ్ మాలగల వక్షస్థలమును గలవాఁడును నాకు సేవసాదించిన స్వామియు నైన శ్రీకృష్ణునియొక్క యాశ్చర్యచేష్టితములను ధ్యానింపఁదగిన మనస్సుకలవాఁడనైన నాకు ఇఁకమీఁద విశాలమైన భూమియందొప్పైనవారెవరు ?

తా. భక్తులయొక్క దుఃఖమును సహింపక నతి హేయమైన మనుష్యయోనిలో నవతరించి శత్రువులను సంహరించిన శ్రీకృష్ణచరిత్రములను ధ్యానించుచున్న నా కెవ్వరును సమానులుకారు. ... ... ౭

నీణిలత్తోడువాన్ వియప్ప నిత్తై పెరుమ్పోర్ కళ్ శెయ్తు *
వాణనాయిరన్దోళ్ తుణిత్తతుమ్ ఉళ్ పడమ ఱ్ఱుమ్పల *
మాణియాయ్ నిలఙ్గొణ్డమాయన్ ఎన్నప్పన్ మాయఙ్గళే *
కాణుమ్ నెఞ్జుడైయేన్ ఎనక్కినియెన్న కలక్కముణ్డే. ౮

నీళ్ నిలత్తోడు వాన్ వియప్ప నిత్తై పెరుమ్పోర్ కళ్ శెయ్తు వాణన్ ఆయిరన్దోళ్ తుణిత్తతుమ్ ఉట్పడ మత్తుమ్ పల మాణియాయ్ నిలమ్ కొణ్డ మాయన్ ఎన్నప్పన్ తన్ మాయ

విశాలమైన భూమియందున్నవారితోఁగూడ దేవలోకమందున్నవారు ఆశ్చర్యపడునట్లు (సేనలతో) నిండియున్న గొప్పయుద్ధములను జేసి బాణాసురునియొక్క వేయిభుజములను ఛేదించినది మొదలైన ఇఁక ననేకవిధములై, బ్రహ్మచారియై భూమిని స్వీకరించిన కృత్రిమూఁడైన నా స్వామియొక్క ఆశ్చర్యకరంబులైన చేష్టితముల

జ్గల్ కాణుమ్ నెఞ్జు ఉడై యేన్ ఇని ఎనక్కు ఎన్న కలక్కమ్ ఉణ్డు.

ననుభవింపఁదగిన మనస్సు కలవాఁడనైతిని. ఇఁక మీఁద నాకు ఏమి యజ్ఞానము కలదు?

తా. దేవమనుష్యాదులందఱు నాశ్చర్యపడునట్లు బాణాసురునియొక్క వేయిభుజములను ఛేదించిన శ్రీకృష్ణునియొక్క దివ్యచరిత్రముల ననుభవించు చున్న నాకొక యజ్ఞానమును లేదు. ... ... ౮

కలక్కవేழ் కడలేழ் మలై యులగేழுమ్కழியక్కడాయ్ *
ఉలక్కత్తేర్ కొడు శెన్ఱమాయముమ్ ఉళ్ పడమఱ్ఱుమ్బల *
వలక్కైయాழியిడక్కైచ్చఙ్గమ్ ఇవైయుడై మాల్ వణ్ణనై *
మలక్కునావుడై యేఱ్కు మాఱుళదో విమ్మణ్ణిన్ మిశైయే. ౯

ఏழ் కడల్ ఏழ் మలై ఏழ் ఉలకుమ్ కలక్క కழியక్ కడాయ్ తేర్ కొడు ఉలక్క శెన్ఱ మాయముమ్ ఉట్పడ ముత్తుమ్ పల వలక్కై ఆழி ఇడక్కై శఙ్గమ్ ఇవై ఉడై మాల్ వణ్ణనై మలక్కుమ్ నా ఉడై యేఱ్కు ఇ మణ్ణిన్ మిశై మాఱు ఉళతో.

సప్తసముద్రములును, సప్త కులాచలములును, సప్తలోకములును ఒకతీరున వెనుకపడునట్లు నడిపించి రథముతోఁగూడ సాంతముగాఁ బోయిన యాశ్చర్యమును, ఇవి మొదలుగాఁగల యిఁక ననేకవిధములైన వ్యాపారములను, కుడిచేతులో సుదర్శనమును, ఎడమచేతిలో శ్రీ పాంచజన్యమును వీనినిగల శ్యామమైన కాంతిగల శ్రీకృష్ణుని యానందింపించుచున్న నాలుక (స్తోత్రము) గల నాకు ఈ భూలోకముమీఁద నెదురైనవా రున్నారా?

తా. వైదికబ్రాహ్మణునికొఱకై తేరుమీఁద నెక్కుకొని యీ లీలావిభూతిని దాటిపోయి పరమపదమునందున నా బ్రాహ్మణపుత్రులను దెచ్చిన శ్రీకృష్ణుని స్తుతించుచున్న నాకు సమానులెవరు లేరు. ... ... ౯

మణ్ మిశై ప్పెరుమ్ బారమ్ నీజ్గ ఓర్ పారదమా పెరుమ్ పోర్
పణ్ణి * మాయజ్గళ్ శెయ్ దు శేనై యై ప్పాఴ్ పడ నూఱ్ఱిట్టుప్పోయ్ *
విణ్ మిశై త్తన తామమే పుక మేవియ శోదిర్ తాళ్ *
నణ్ణినార్ వణజ్గప్పెఱ్ఱే ఎనక్కార్ పిఱర్ నాయకరే. ౧౦

మణ్ మిశై పెరు భారమ్ నీజ్గ ఓర్ భారతమా పెరు పోర్ పణ్ణి మాయజ్గళ్ శెయ్ తు శేనై యై పాఴ్ పడ నూత్తిట్టు పోయ్ విణ్ మిశై తన ధామమే మేవి పుక్క శోతిర్ తాళ్ నణ్ణినార్ వణజ్గ పెత్తే ఎనక్కు పిఱర్ నాయకర్ ఆర్.

భూమియొక్క మీదనున్న గొప్ప భారము తొలఁగునట్లు, అద్వితీయమైన భారతమనెడి గొప్ప యుద్ధమును జేసి, కృత్రిమములను జేసి సేనలను నశించునట్లు మోచించి (తరువాత) వేంచేసి పరమపదమందు తన దివ్య తేజస్సునందు వెళ్ళి ప్రవేశించిన తేజోరూపుఁడైన శ్రీకృష్ణునియొక్క శ్రీపాదములను బొంది నేను కైంకర్యముచేయ లభించితిని. నాకు వేఱు నియామకు లెవరు?

తా. అసురప్రకృతులైన రాజులచే నిండియున్న భూమియొక్క భారమును బోఁగొట్టుటకై యవతరించి యారాజులను నశింపఁజేసి తిరిగి పరమపదమునకు వేంచేసిన శ్రీకృష్ణుని శ్రీపాదముల నాశ్రయించిన నాకు మఱియొకరు నియామకులు కారు. ... ... ... ... ౧౦

* నాయకర్ ముఴు వేఴులకుక్కుమాయ్ ముఴు వేఴులగుమ్ * తన్
వాయకమ్పుక వైత్తుమిఴ్ న్దు అవై యాయవై యల్లనుమామ్ *
కేశవనడియిణై మిశై కురుకూర్చ్చడకోపన్ శొన్న *
తూయవాయిర త్తిప్పత్తాల్ పత్తరావర్ తువళిన్ఱియే. ౧౧

ముఴు వేఴులకుక్కుమ్ నాయకనాయ్ ముఴు వేఴుల కుమ్ తన్ వాయకమ్ పుక

సంపూర్ణమైన సప్తలోకములకును స్వామియై సంపూర్ణమైన సప్తలోకములను తన నోటిలోఁ బ్రవేశింపఁజేసి (మ్రింగి) బయలుపఱచి

వైత్త ఉమిళ్న్దు అవై
యాయ్ అవై యల్లనుమామ్
కేశవనడియినై మిశై కురు
కూర్ చ్చడకోపన్ శొన్న
తూయ ఆయిరత్తు ఇప్పత్తాల్
తువళిన్ఱి ప్పత్తరావర్.

ఆలోకముల కంతర్యామియై వానియొక్క దోష ములు లేనివాఁడునైన కేశవునియొక్క శ్రీపాద ద్వంద్వములమీఁద కురుకాపురాధీశులైన నమ్మాళ్వార్లు పాడించిన నిర్దుష్టంబులైన వేయిపాశురములలో నీ పదిపాశురములచే దోషము లేనివారై భక్తులగుదురు.

తా. శ్రీకృష్ణవిషయమైన యీపదిపాశురముల నభ్యసించువారు శ్రీకృష్ణుని యందు మిక్కిలి భక్తిగలవా రగుదురు. ... ... ౧౧

షష్ఠశతకములో చతుర్థదశకము ముగిసెను.

ఆళ్వార్ ఎమ్బెరుమానార్ జీయర్ తిరువడికళే శరణమ్.

---

తిరువాయ్ మొళ్ళి - షష్ఠశతకములో

## పంచమదశకము — తువళిల్ మామణి

అవతారిక:—నమ్మాళ్వార్లిదివఱకు శ్రీకృష్ణ దివ్యచేష్టితాదులను మానసముగ ననుభవించగా నాయనుభవము మిక్కిలి యధికమై ప్రత్యక్షముగ ననుభవించుటకు నాశను గలుగఁజేయ నాయనుభవము లభింపనందున ముందున్న మానసానుభవముకూడ పోయి శిథిలాంతఃకరణులై యుండగా నప్పుడు వీరి యవసాదమును బోఁగొట్టుటకై కొందఱు వీరియొక్క భగవదనుభవములం దాశను బోఁగొట్ట యత్నింప, కొందఱు భాగవతులు చిరకాలముగ నందులోనే మగ్నులై యున్న వీరి నిప్పుడు నిషేధించుట మీకసాధ్యమని పాడించిన పాశురముల నన్యాపదేశముగ ప్రసాదించుచున్నారు. ఈదశకము సఖీవాక్యము. *

* తువళిల్ మామణిమాడమోజ్గు తులైవిల్లిమజ్గలమ్ తొ్ౙు
మివళై * నీరినియనన్నైమీర్ ఉమక్కాశై యిల్లైవిడుమినో *
తవళవొణ్ శజ్గుశక్కరమెన్టుమ్ తామరైత్తడజ్గణెన్టుమ్ *
కువళైయొణ్ మలర్‌క్కణ్‌గళ్ నీర్ మల్‌క నిన్టునిన్టుకుమిఱుమే. ౧

తువళిల్ మా మణి మాడమ్ ఓజ్గు తులై విల్లి మజ్గలమ్ తొ్ౙుమ్ ఇవళై నీర్ ఇని అన్నైమీర్ ఉమక్కు ఆశై ఇల్లై విడుమిన్ తవళమ్ ఒణ్ శజ్గు శక్కరమ్ ఎన్టుమ్ తామరై తడమ్ కణ్ ఎన్టుమ్ కువళై ఒణ్ మలర్ కణ్గళ్ నీర్ మల్‌క నిన్టునిన్టు కుమిఱుమ్.

దోషములేని శ్లాఘ్యమైన రత్నములచే నిర్మింపఁబడిన గృహములు పెరిగియున్న తులై విల్లి మజ్గలమనెడు దివ్యదేశము నాశ్రయించు యీామెను మీరు, ఇఁకమీద ఓతల్లులారా! మీకు (స్వాధీనపఱచుకొనుటకు) ఆశలేదు, విడువండి. తెల్లనై సుందరమైన శంఖము చక్రము అనియు కమలములవలె విశాలమైన నేత్రములనియు (చెప్పి) నల్లకలువయొక్క సుందరమైన పుష్పమువంటి నేత్రములు బాష్పములచేఁ బూర్ణమగునట్లు ఉండి యుండి లోపలనే సంకటపడుచున్నది.

తా. మహార్ఘమై దేదీప్యమాన రత్నఖచితమైన గృహాదులచే నలంకరింపఁబడి నతులై విల్లిమంగలమను దివ్యదేశమునకువెళ్ళి యచ్చట భగవంతుని యాశ్రయించి వానియొక్క దివ్యావయవసౌందర్యము ననుభవించి శంఖచక్రాది దివ్యాయుధములను నయనసౌందర్యాదులను స్తోత్రముఁజేయ యత్నించి దానికి శక్తిలేక యనక్షరముగ కొన్నిమాటలనుబలికి నేత్రములలోనుండి ధారధారగా బాష్పములను బ్రవహింపఁజేయుచున్న యీామెనుత్రిప్పుటకు ఇంకమీద మీకు సాధ్యము కాదని నాయికయొక్క తల్లులనుజూచి సఖియలు చెప్పుచున్నారు. ... ౧

కమిఱుమోశై విఴవొలి త్తులైవిల్లిమజ్గలమ్కొణ్డుపుక్కు *
అముతమెన్మొఴియాళై నీరుమక్కాశై యిన్టియకళ్ త్తినీర్ *

తిమిర్ కొణ్డాలొత్తునిఱ్కుమ్ మత్ఱివళ్ తేవ తేవపిరానెన్ఱే *
నిమియుమ్వాయొడు కణ్గళ్ నీర్ మల్క నెక్కొశిన్దుకరైయుమే. ౨

కుమిఱుమ్ ఓశై విழవొలి తులైవిల్లి మఙ్గలమ్ కొణ్డు పుక్కు అముతమ్ మెన్ మొழియాళై నీర్ ఉమక్కు ఆశైయిన్ఱి అకత్ఱినీర్ ఇవళ్ తిమిర్ కొణ్డాలొత్తునిఱ్కుమ్ మత్ఱు తేవర్ తేవర్ పిరాన్ ఎన్ఱే నిమియుమ్ వాయొడు కణ్గళ్ నీర్ మల్క నెక్కు ఒశిన్దు కరైయుమ్.

ఒకటికొకటి భేదము తెలియకుండ వర్ధిల్లుచున్న (వేదాధ్యయన నృత్తగీతాదుల) ఘోషములుగల ఉత్సవమందలి కోలాహలధ్వనిగల తులైవిల్లిమంగలమునకు దీసికొనిపోయి ప్రవేశించి యమృతమువలె భోగ్యమైన మాటగల యీమెను మీకు (ఈమెయొక్క మధురాలాపము వినుటకు) ఆశలేకపోవుటచే విడిచితిరి. (అస్వాధీనురాలై చేసికొనిరి). ఈమె స్తబ్ధురాలయినట్లు (నిశ్చేష్టురాలై) ఉండును. మఱియు నిత్యసూరులకు దేవతలైన విష్వక్సేనాదులకు స్వామియనియే (చెప్పుటకు శక్తిలేక) చలించుచున్న యధరములోఁగూడ నేత్రములలో నీళ్లునిండునట్లు శిథిలురాలై పరవశమై కరుగుచున్నది.

తా. ఓతల్లులారా! మీరు తులైవిల్లి మంగలమందు మహోత్సవమునకీమెను దీసికొనివెళ్లఁగా నచ్చటనున్న కోలాహలమును విని యది మొదలగు ఈమె ఇతరవ్యాపారములను వదలి నిశ్చలముగానుండి భగవద్గుణములను స్మరించి కరుగుచున్నది. ఈమెయొక్క మధురాలాపములను వినుటకుఁ బ్రాప్తిలేకుండునట్లు ఈ యనర్థమును మీరే చేసికొంటిరి. ... ... ... ౨

కరైకొళ్ పైమ్బొழిల్ తణ్పణై త్తులైవిల్లిమఙ్గలమ్కొణ్డుపుక్కు *
ఉరైకొళ్ ఇన్మొழియాళై నీరుమక్కాశైయిన్ఱియకత్ఱినీర్ *
తిరైకొళ్ పౌవత్తుచ్చేర్న్దదుమ్ తిశైఞాలమ్తావియళన్దదుమ్ *
నిరైకళ్ మేయ్త్తదుమేపిదత్ఱి నెడుఙ్గణ్ణీర్ మల్కనిఱ్కుమే. 3

కరైకొళ్ పైమ్ పొழిల్
తణ్ పణై తులై విల్లిమఙ్గలమ్
కొణ్డుపుక్కు ఉరైకొళ్ ఇన్
మొழియాళై నీర్ ఉమక్కు
ఆశైయిన్ఱి అకప్పడుత్తినీర్; తిరై
కొళ్ పౌవత్తు శేర్న్దదుమ్
తిశై ఞాలమ్ తావి అళన్ద
తుమ్ నిరైకళ్ మేయ్త్త
తుమే పిదఱ్ఱి నెడు కణ్
నీర్ మల్క నిఱ్కుమ్.

నదీతీరమును గబళీకరించుచున్న (వ్యాపించి యున్న, విశాలమైనతోటలను, చల్లనైన కొలనులనుగల తులైవిల్లిమంగలమునకు దీసికొని ప్రవేశించి లోకులు కొనియాడఁదగిన మధురమైన మాటలుగల యీమెను మీరు మీకు ఆశలేకనే దూరముగాఁ జేసికొంటిరి. అలలుగల సముద్రమును జేరినదానిని, దిక్కులతోఁ జేరిన భూమిని శ్రమలేకఁ బెరిగి కొలిచినదానిని, ఆవులను మేపిన దానినే జల్పించి విశాలనేత్రములందు నీళ్ళునిండునట్లు (ఈమె స్తబ్ధురాలై) ఉన్నది.

తా. తోటలచేతను తటాకములచేతను నిండి రమణీయమైన తులైవిల్లిమంగలమునకు మీరు తీసికొనివెళ్ళఁగా, ఈమె యచ్చట వేంచేసియున్న శ్రియఃపతియొక్క దివ్యగుణములయందు మగ్నురాలై మీకు స్వాధీనము కాకపోయినది. ఈ యనర్థమును మీరే తెచ్చుకొంటిరి. ... ... 3

నిఱ్కుమ్నాన్మఱై వాణర్ వాழ் తులైవిల్లిమఙ్గలమ్కణ్డపిన్ *
అఱ్కు మొన్ఱుమఱవుఱాళ్ మలిన్దాళ్ కణ్డీర్ ఇవళ్ అన్నైమీర్ *
కఱ్కుమ్కల్వియెల్లామ్ కరుఙ్కడల్ వణ్ణన్ కణ్ణపిరానెన్ఱే *
ఒఱ్కమొన్ఱుమిలళ్ ఉకన్దుకన్దుళ్ మకిழ్న్దు కుழైయుమే. ర

నిఱ్కుమ్ నాల్ మఱై
వాణర్ వాழ் తులైవిల్లిమఙ్గ
లమ్ కణ్డపిన్ ఇవ అఱ్కుమ్
ఒన్ఱుమ్ ఉఱాళ్; ఇవళ్ మలి
న్దాళ్ అన్నైమీర్ కణ్డీర్
కఱ్కుమ్ కల్వియెల్లామ్ కరు

నిత్యమైయున్న నాలుగు వేదములుగల బ్రాహ్మణులు వాసముఁ జేయుచున్న తులైవిల్లి మంగలమును సేవించినతరువాత కొంచెమైనను స్త్రీత్వమర్యాదను (పెద్దలకు లోబడియుండడము) ఒకవిధమైనను పొందకుండనున్నది. ఈమె మర్యాద నతిక్రమించినది. ఓతల్లులారా! చూచి

కడల్ వణ్ణన్ కణ్ణన్ పిరాన్ ఎన్రే ఒన్రుమ్ ఒழிక్కుమ్ ఇలళ్ ఉకన్దుకన్దు ఉళ్ మకిழ்న్దు కుழైయుమ్.

తిరా! అభ్యసించుచున్న మాటలన్నియు శ్యామమైన సముద్రమువంటి కాంతిగల శ్రీకృష్ణుఁడనెడి యుపకారకుఁడనియే (చెప్పును). కొంచెమైనను సిగ్గులేనిదై మిక్కిలి సంతోషించి హృదయమందు ప్రీతురాలై శిథిలురాలగుచున్నది.

తా. ఓతల్లులారా! ఈమె తులైవిల్లిమంగలమును జూచినప్పటినుంచి మీ మాటలను వినక స్వతంత్రురాలై శ్రియఃపతియొక్క తిరునామములనే యెల్లప్పుఁడు ననుసంధించుచు మిక్కిలి సంతోషమునొంది మీరున్నారనికూడఁ జూడక సిగ్గులేని వ్యాపారములను జేయుచున్నది. ... ... ౪

కుழైయుమ్వాళ్ ముకత్తేழైయై త్తులైవిల్లిమఙ్గలమ్కొణ్డుపుక్కు *
ఇழைకొళ్ శోతిచ్చెన్దామరైక్కట్ పిరాన్ ఇరున్దమైకాట్టినీర్ *
మழைపెయ్ తాలొక్కుమ్కణ్ణనీరినొడుఅన్రుతొట్టుమ్మైయాన్దివళ్ *
నుழைయుమ్శిన్దైయళన్నైమీర్ తొழுమత్తిశైయుఱ్రునోక్కియే. ౫

కుழైయుమ్ వాళ్ ముకత్తు ఏழైయై తులైవిల్లి మఙ్గలమ్ కొణ్డు పుక్కు ఇழై కొళ్ శోతి శెమ్ తామరై కణ్ పిరాన్ ఇరున్దమై కాట్టినీర్; అన్నైమీర్ అన్రు తొట్టుమ్ ఇవళ్ మழைపెయ్ తాలొక్కుమ్ కణ్ణనీరికొడు మైయాన్దు నుழைయుమ్ శిన్దైయళ్ అత్తిశై ఉఱ్రు నోక్కి తొழுమ్.

(తన మృదుస్వభావముచే) శిథిలురాలైన సుందరముఖముగల (భగవద్గుణమందు) అతిచపలురాలైన యీయామెను తులైవిల్లిమంగలమునకు దీసికొనిపోయి ప్రవేశించి ఆభరణములచేఁ గలిగిన తేజస్సును, ఎఱ్ఱ తామరవంటి నేత్రములనుగల స్వామి వేంచేసియున్న విధమును జూపిరి. ఓతల్లులారా! ఆదిమొదలు ఈమె వర్షధారతో సమానమైన కన్నీళ్ళతో భ్రమించి (భగవద్గుణములయందు) అవగాహించుచున్న మనస్సుకలదై యాదిక్కును ఏకాగ్రముగఁ జూచి యంజలి చేయును.

తా. ఓ తల్లులారా! మీ రీమెను దీసికొనివెళ్ళి తులైవిల్లిమంగలమందు వేంచేసియున్న శ్రియఃపతిని సేవింపించినప్పటినుంచి వానిగుణములయందే మగ్నురాలై యాదిక్కునుజూచి దండము సమర్పించుచున్నది. ... ౫.

నోక్కుమ్పక్క మెల్లామ్ కరుమ్బుడు శెన్నెలోఙ్గు శెన్దామరై *
వాయ్క్కుమ్తణ్ పొరునల్ వడకరై వణ్ తులైవిల్లిమఙ్గలమ్ *
నోక్కునేల త్తిశైయల్లాల్ మఱునోక్కిలళ్ వైగల్నాడొఱుమ్ *
వాయ్కొళ్ వాశకముమ్ మణివణ్ణ నామమేయివళన్నైమీర్. ౬

నోక్కుమ్పక్క మెల్లామ్ కరుమ్బుడు శెన్నెల్ ఓఙ్గు శెన్దామరై వాయ్క్కుమ్ తణ్ పొరునల్ వడకరై వణ్ తులైవిల్లిమఙ్గలమ్ నోక్కుమేల్ అత్తిశైయల్లాల్ మఱు నోక్కిలళ్ వైకల్ నాడొఱుమ్ ఇవళ్ వాయ్కొళ్ వాశకముమ్ అన్నైమీర్! మణి వణ్ణ నామమే.

చూచినచోటంతయు చెరుకుతోఁగూడ ఎఱ్ఱధాన్యమును, ఉన్నతమైయున్న ఎఱ్ఱతామరయు సమృద్ధమైయున్న చల్లనైన తామ్రపర్ణి యొక్క ఉత్తరతీరమందున్న సుందరమైన తులైవిల్లిమంగలమును జూచినయెడల నాదిక్కుతప్ప మఱియొక వస్తువునుజూడదు. సర్వకాలమందు సకలదినములందును ఈమె నోటితోఁజెప్పుచున్న మాటలును, ఓతల్లులారా! నీలరత్నమువంటి కాంతిగల శ్రియఃపతియొక్క తిరునామములైయే యుండును.

తా. ఓ తల్లులారా! చెరుకుతోటలచేతను, ధాన్యముపండియున్న పొలములచేతను, తామర చెరువులచేతను నిండి యతి రమణీయమై, తామ్రపర్ణినదికి నుత్తరగట్టునందున్న తులైవిల్లిమంగలమును వదలి యీమె మఱియొకదానిని జూడదు. ఆశ్రియఃపతియొక్క తిరునామములుతప్ప మఱియొకమాటను జెప్పదు. ౬

అన్నైమీరణిమామయిల్ శిఱుమానివళ్ నమ్మైక్కైవలిన్దు *
ఎన్న వార్త్తైయుమ్ కేట్కుఱాళ్ తులైవిల్లిమఙ్గలమెన్నల్లాల్ *

మున్నమ్ నోఱ్ఱ విదికొలో ముకిల్ వణ్ణన్ మాయజ్గొలో * అవన్
శిన్నముమ్ తిరునామముమ్ ఇవళ్ వాయనకళ్ తిరున్దవే. ౭

అన్నైన్మీర్ అణి మా మయిల్ శిఱుమాన్ ఇవళ్ నమ్మై క్కై వలిన్దు తులై విల్లిమజ్గల మెన్ఱల్లాల్ ఎన్న వార్త్తైయుమ్ కేట్కు ఉఱాళ్; మున్నమ్ నోఱ్ఱ విదికొలో ముకిల్ వణ్ణన్ మాయజ్గొలో అవన్ శిన్నముమ్ తిరునామముమ్ తిరున్ద ఇవళ్ వాయన కళ్.

ఓ తల్లులారా! అందమైన కాంతిగల నెమలివలెను చిన్న లేడివలెను నున్న యీమె మనల నతిక్రమించి తులై విల్లిమంగలమనెడి మాటతప్ప ఏమాటలను వినుట కాశింపదు. జన్మాంతరమందు చేసిన భాగ్యమో? మేఘము వంటి కాంతిగల శ్రీకృష్ణునియొక్క యాశ్చర్య చేష్టితమో? శ్రియఃపతియొక్క చిహ్నము లును తిరునామములును స్వచ్ఛమగుటకై ఈమె యొక్క నోటిలోనున్నవి.

తా. ఓ తల్లులారా! ఈమె తులై విల్లిమంగలమనెడి మాటతప్ప మన మాటను వినదు. ఇది యీమెయొక్క జన్మాంతరమందు చేసిన పుణ్యమో? నిర్హేతుక భగవత్కృపనో తెలియలేదు. ... ... ౭

తిరున్దు వేదముమ్ వేళ్వియుమ్ తిరుమామకళిరున్దామ్ * మలి
న్దిరున్దు వాళ్ పొరునల్ వడకరై వణ్ తులై విల్లిమజ్గలమ్ *
కరున్దడజ్కణ్ణికై తొళ్లుత అన్నాళ్ తుడజ్గి ఇన్నాళ్ డొఱుమ్ * ఇరు
న్దిరున్దరవిన్దలోశన వెన్ఱెన్ఱే నైన్దిరజ్గుమే. ౮

తిరున్దు వేతముమ్ వేళ్వియుమ్ మా తిరుమకళిరుమ్ తామ్ మలిన్దు ఇరున్దు వాళ్ పొరునల్ వడకరై వణ్ తులై విల్లిమజ్గలమ్ కరు తడమ్ కణ్ణి

సుశిక్షితమైన వేదమును యాగమును శ్లాఘ్యమైన శ్రీమహాలక్ష్మియు తాము సమృద్ధమై యుండి శోభిల్లుచున్న తిరుప్పొరునల్ నదియొక్క ఉత్తరగట్టునందున్న సుందరమైన తులై విల్లిమంగ లమును నల్లనై విశాలమైన నేత్రములుగల

కై త్తొళుత అన్నాళ్ తొడజ్గి ఇన్నాడొఱుమ్ ఇరున్దిరున్ద అరవిన్దలోచన ఎన్ఱెన్ఱే నైన్దు ఇరఙ్గుమ్.

యీామె చేతులచే సేవించినది మొదలు ఇదివఱకు చిరకాలముండి అరవిందలోచనుఁడా! యని పలుమా అనుసంధించి శిథిలురాలై బాధపడు చున్నది.

తా. ఓ తల్లులారా! ఈమె తులైవిల్లి మంగలము నాశ్రయించినప్పటినుంచి శ్రియఃపతియొక్క తిరునామములనే జెప్పుచు ఖేదించుచున్నది. ... ౮

ఇరఙ్గినాడొఱుమ్వాయ్ వెరీఇ ఇవళ్ కణ్ణనీర్ కళలమర *
మరఙ్గళుమిరఙ్గుమ్వకై మణివణ్ణవో వెన్ఱుకూవుమాల్ *
తురఙ్గమ్ వాయ్ పిళన్దానుఱై తులైవిల్లి మఙ్గలమెన్ఱు * తన్
కరఙ్గళ్ కూప్పితొళుమ్ అవ్వూర్ త్తిరునామఙ్గళ్ ఱతట్పినైన్ఱే. ౯

ఇవళ్ నాడొఱుమ్ ఇరఙ్గి వాయ్ వెరీఇ కణ్ణనీర్ కళ్ అలమర మరఙ్గళుమ్ ఇరఙ్గుమ్వకై మణి వణ్ణవో ఎన్ఱు కూవుమ్; తురఙ్గమ్ వాయ్ పిళన్దాన్ ఉఱై తులైవిల్లి మఙ్గల మెన్ఱు అవ్వూర్ త్తిరు నామమ్ కళ్ ఱతట్పినైన్ఱు తన్ కరఙ్గళ్ కూప్పి తొళుమ్.

ఈమె ప్రతిదినమును బాధపడుచు జల్పించి కంటినీళ్లు కాఱుచుండగా వృక్షములుగూడ దయ చేయునట్లు రత్నమువంటి కాంతిగలవాఁడా! యని యఱచి పిలుచుచున్నది. గుఱ్ఱమైవచ్చిన కేశి యొక్క నోటిని జీల్చిన శ్రీకృష్ణుఁడు నిత్య వాసముఁజేయుచున్న తులైవిల్లి మంగలమని యా దివ్యదేశముయొక్క తిరునామమును జెప్పినతరు వాత తనచేతులను జోడించి సేవించును.

తా. ఈమె నేత్రములలోనుండి నీళ్ళుచు బ్రవహింపఁజేయుచు శ్రియఃపతి యొక్క తిరునామములనే జెప్పుచు, ఆదివ్యదేశముయొక్క తిరునామములను జెప్పి నమస్కరించును. ... ... ... ... ౯

పిన్నై కొల్ నిలమామకళ్ కొల్ తిరుమకళ్ కొల్ పిఱన్దిట్టాళ్ *
ఎన్నమాయఙ్గొలో ఇవళ్ నెడుమాలెన్రే నిన్ఱుకూవుమాల్ *
మున్నివన్దవన్నిన్ఱిరున్దుఱైయుమ్ తులై విల్లిమఙ్గలమ్
శెన్నియాల్ వణఙ్గుమ్ * అవ్వూర్తిరునామమ్ కేట్పదుశిన్దైయే. ౧౦

పిన్నై కొల్ నిలమ్ మా మకళ్ కొల్ తిరుమకళ్ కొల్ పిఱన్దిట్టాళ్ ! ఎన్న మా య ఙ్గొ లో ఇ వ ళ్ నెడుమాలెన్రే నిన్ఱు కూవుమ్; అవన్ మున్ని వన్దు నిన్ఱిరున్దు ఉఱైయుమ్ తులై విల్లి మఙ్గలమ్ శెన్నియాల్ వణఙ్గుమ్; అవ్వూర్తిరునామమ్ కేట్పతే శిన్దై.

నపిన్న పిరాట్టియో ? భూమికి నిర్వాహకురాలై శ్లాఘ్యురాలైన భూమిప్పిరాట్టియో ? శ్రీమహాలక్ష్మియో ? అవతరించెను. ఏ మాశ్చర్యమో ! ఈమె సర్వేశ్వరుఁడనియే యేకాగ్రముగానుండి యఱచి పిలుచును. ఆసర్వేశ్వరుఁడు మునుపు వచ్చియుండి నిత్యవాసముఁ జేయుచున్న తులై విల్లిమంగలమును శిరస్సుచే నమస్కరించును. ఆదివ్యదేశముయొక్క తిరునామమును వినుటయందు మనస్సుకలదై యుండును.

తా. ఈమెయొక్క భగవద్గుణానుభవమం దభినివేశమును జూచినయెడల శ్రీభూనీళాదేవులలో నొకరియొక్క యవతారమై యుండవచ్చునని తోచుచున్నది. ఆదివ్యదేశముయొక్క తిరునామమును వినుటయందే యీమె యాసక్తురాలై యుండును. ... ... ... ... ౧౦

* శిన్దైయాలుమ్శొల్లాలుమ్ శెయ్కై యినాలుమ్ తేవపిరానై యే *
తన్దైతాయెన్ఱడైన్ద వణ్ కురుకూరవర్ శఠకోపన్ *
మున్దైయాయిరత్తుళ్ళివై తులై విల్లిమఙ్గలత్తైచ్చొన్న *
శెన్దమిழ் పత్తుమ్వల్లార్ అడిమై శెయ్ వార్ తిరుమాలుక్కే. ౧౧

తేవపిరానై యే తన్దై
తాయెన్ఱు శిన్దైయాలుమ్ శొల్లా
లుమ్ శెయ్ కైయినాలుమ్
అడైన్ద వణ్ కురుకూరవర్
శడకోపన్ మున్దై ఆయిర
త్తుళ్ తులై విల్లి మఙ్గలత్తై
శొన్న శెమ్ తమిళ్ ఇవై
పత్తుమ్ వల్లార్ తిరుమాలు
క్కు అడిమై శెయ్ వార్.

దేవదేవుఁడైన శ్రియఃపతినే తండ్రి తల్లి యని మనస్సుచేతను వాక్కుచేతను పొందిన వారై సుందరమైన కురుకాపురిస్వామియునైన నమ్మాళ్వార్లు అనాదియైన వేదార్థమును బ్రతిపాదించెడి వేయిపాశురములలోఁజేరిన తులై విల్లి మంగలవిషయమై ప్రతిపాదించిన సుందరమైన (సుఖముగా నర్థమును బోధించుచున్న) ద్రావిడ రూపమైన యీ పదిపాశురముల నభ్యసించు వారు శ్రియఃపతికిఁ గైంకర్యముఁ జేయుదురు.

తా. శ్రియఃపతినే సకలవిధబంధువని మనోవాక్కాయములచే నాశ్రయించిన నమ్మాళ్వార్లు ప్రసాదించిన తులై విల్లి మంగలవిషయమైన యీ పదిపాశురముల నభ్యసించువారు భగవత్కైంకర్యమును లభింతురు. ... ౧౧

షష్ఠశతకములో పంచమదశకము ముగిసెను.
ఆళ్వార్ ఎమ్బెరుమానార్ జీయర్ తిరువడికళే శరణమ్.

---

## షష్ఠదశకము — మాలుక్కు

అవతారిక:—భగవద్విషయములో ఈడుపడి పరాంకుశనాయకికి సర్వస్వమున్ను పోయినదని తల్లి చెప్పుట. ... ...

* మాలుక్కు వైయమళన్ద మణాళఱ్కు *
నీలక్కరునిఱ మేకనియాయఱ్కు *
కోలచ్చెన్దామరైక్కణ్ణఱ్కు * ఎన్ కొఙ్గల
శేలక్కణ్ణాలి యిழన్దదుశఙ్గే. ౧

మాలుక్కు వైయమ్ అళన్ద మణాళఱ్కు నీలమ్ కరు నిఱమ్ మేక నియా యఱ్కు కోలమ్ శెమ్ తామరై కణ్ణఱ్కు ఎన్ కొంజు అలర్ ఏలమ్ కుழలి ఇழన్దతు శఙ్గు.

శ్రీశతవ్యామోహముగలవాఁడై, భూమిని గొలిచిన నాయకుఁడై, స్నిగ్ధమై శ్యామమైన వర్ణముగల మేఘముయొక్క ప్రకారముగల (మేఘముతో సమానుఁడైన)వాఁడై, అందమై ఎఱ్ఱనైన పద్మమువంటి నేత్రముగలవాఁడైన శ్రియఃపతిని యాశఁబడి నాకొమార్తెయై తేన గల పుష్పములచే నలంకరింపఁబడిన ఏలకలవలె పరిమళించుచున్న కొప్పుగల యీమె పోఁగొట్టు కొనినది కంకణమును.

తా. త్రివిక్రమావతారంబెత్తి యాచరించిన దివ్యచేష్టితములను, తిరుమేను సౌందర్యమును సేవింప నాశఁబడి కృశించిపోయిన యీమెయొక్క హస్తమందున్న కంకణములు జారిపోయినవి. ... ... ౧

శఙ్గువిల్ వాళ్ తణ్డు శక్కరక్కైయఱ్కు *
శెఙ్గనివాయ్ చ్చెయ్య తామరై క్కణ్ణఱ్కు *
కొఙ్గలర్ తణ్ణన్దుழాయ్ ముడియానుక్కు ఎన్ *
మఙ్గైయిழన్దదు మామైనిఱమే. ౨

శఙ్గు విల్ వాళ్ తణ్డు శక్కరమ్ కైయఱ్కు శెమ్ కని వాయ్ శెయ్య తామరై కణ్ణఱ్కు కొఙ్గలర్ తణ్ అమ్ తుழాయ్ ముడియానుక్కు ఎన్ మఙ్గై ఇழన్దతు 'మామై

శ్రీపాంచజన్యమును శార్ఙ్గమును నందకమును కౌమోదకిని సుదర్శనమును శ్రీహస్తమందుఁ గలవాఁడును, ఎఱ్ఱనైన దొండపండువలెనున్న యధరమును, ఎఱ్ఱనైన పద్మమువంటి నేత్రములుగలవాఁడును, తేనె వ్యాపించియున్న చల్లనై యందమైన తిరుత్తుழాయిమాలగల కిరీటముగలవాఁడు నైన శ్రియఃపతిని యాశఁబడి

నిఱమ్. నాకుమా త్తై పోఁగొట్టుకొనినది అందమైన సౌందర్యమును.

తా. శ్రియఃపతియొక్క పంచాయుధములను, కిరీటము మొదలగు దివ్యాభరణములను, అతిసుందరంబులైన నేత్రములు మొదలగు దివ్యావయవములను సేవింప నాశఁబడిన యీామెయొక్క శరీరము తెల్లబోయినది. ... 9

నిఱజ్గరియానుక్కు నీడులకుణ్డా *
తిఱమ్‌కిళర్ వాయ్ చ్చిఱుక్కశ్వరవఱ్కు *
కఱజ్గియ శక్కరక్కైయవనుక్కు * ఎన్
పిఱజ్గిరుజ్కూన్దల్ ఇழన్దదుపీడే. 3

కరియ నిఱత్తానుక్కు నీడులకు ఉణ్డా తిఱమ్ కిళర్ వాయ్ శిఱు కళ్వరవఱ్కు కఱజ్గియ శక్కరమ్ కైయవనుక్కు ఎన్ పిఱజ్గిరుజ్గూన్దల్ ఇழన్దతు పీడు.

శ్యామమైన వర్ణముగలవాఁడును, విశాలమైన లోకముల నారగించినవిధమును జెప్పుచున్న (సూచనజేయుచున్న) యధరముగలబాలుఁడైన యపరిచ్ఛిన్నమహిమగలవాఁడును, తిరుగుచున్న సుదర్శనమును శ్రీహస్తమందుఁ గలవాఁడు నైన శ్రియఃపతిని యాశించి నిబిడమై దీర్ఘమైయున్న కేశపాశముగల నాకొమాత్తై పోఁగొట్టుకొనినది మహిమను.

తా. సకలలోకముల నారగించి వటపత్రమందుఁ బవ్వళించియున్న శ్యామసుందరుఁడైన శ్రియఃపతిని సేవింప నాశఁబడి యీామె తనమదింపును బోఁగొట్టుకొనెను. ... ... ... ... 3

పీడుడైనాళ్ముకనై ప్పడైత్తానుక్కు *
మాడుడై వైయమళన్ద మణాళఱ్కు *

నాడుడై మన్నఱ్కు త్తూదు శెల్ నమ్బిక్కు * ఎన్
పాడుడై యల్ గుల్ ఇழన్దదు పణ్బే. ౮

పీడుడై నాన్ముకనై పడైత్తానుక్కు మాడుడై వైయమ్ అళన్ద మణాళఱ్కు నాడుడై మన్నర్ క్కు తూతు శెల్ నమ్బిక్కు ఎన్ పాడు ఉడై అల్ కుల్ ఇழన్దదు పణ్బు.

మహత్వముగల (జ్ఞానాదిపూర్ణుఁడైన) చతుర్ముఖుని సృజించినవాఁడును ధనముగల భూమిని గొలిచిన నాయకుఁడును దేశముగల రాజులైన పంచపాండవులకు దూతకృత్యము నాచరించిన పూర్ణుఁడు నైన శ్రియఃపతిని యాశించి విశాలమైన జఘనప్రదేశముగల నా కుమార్తె పోఁగొట్టుకొనినది (తన) స్వభావమును.

తా. చతుర్దశభువనములకు స్రష్టయైన బ్రహ్మను సృజించిన గొప్పవాఁడైనను ఆశ్రితార్థమై దౌత్యముఁజేసిన యతిసులభుఁడైన శ్రియఃపతిని సేవింప నాశించి యీమె తనస్వభావమును బోఁగొట్టుకొనెను. ... ౮

పణ్ పుడై వేదమ్ పయన్దపరనుక్కు *
మణ్ పురై వైయమిడన్ద వరాకఱ్కు *
తెణ్ పునల్ పళ్ళి యెమ్ తేవపిరానుక్కు * ఎన్
కణ్ పునైకోదై యిழన్దతు కఱ్పే. ౯

పణ్బుడై వేతమ్ పయన్ద పరనుక్కు మణ్ పురై వైయమ్ ఇడన్ద వరాకఱ్కు తెణ్ పునల్ పళ్ళి ఎమ్ తేవర్ పిరానుక్కు ఎన్

(తత్త్వప్రతిపాదన) స్వభావముగల వేదము నుపదేశించిన పరాత్పరుఁడును, మృత్తుచేత నధికమైన (కఠినమైన) భూమిని విడఁదీసిన శ్రీవరాహావతారమెత్తినవాఁడును, నిర్మలమైన మహాజలమును బడకగాఁగలవాఁడును, మనకును దేవతలకును స్వామియైనవాఁడు నైన శ్రియఃపతిని యాశిఁ

కణ్బనైక్కోత్తై ఇఱ్ఱన్దతు కణ్ణు.

బడి (చూచినవారియొక్క) నేత్రములను గప్పుచున్న (సౌందర్యముచే నాకర్షించుచున్న మాల గల నాకుమార్తె పోఁగొట్టుకొనెను జ్ఞానమును.

తా. మహాసముద్రమందు మునిగియున్న భూమిని వరాహావతారంబెత్తి యుద్ధరించియు, వేదముల నుపదేశించియు చేతనులకు మిక్కిలి యుపకారకుఁడైన శ్రియఃపతిని సేవింప నాశఁబడి యీమె యేమియుఁ దోచక భ్రమించి పోయినది. ... ... ... ... ౫

కఱ్పకక్కావన నఱ్పలతోళఱ్కు *
పొఱ్పుడర్కున్ఱన్న పూన్దణ్ముడియఱ్కు *
నఱ్పలతామరై నాణ్మలర్ కైయర్కు * ఎన్
విఱ్పురువక్కొడి తోఱ్ఱదుమెయ్యే. ౬

కఱ్పకక్కావన నల్ పల తోళఱ్కు శుడర్ పొఱ్కున్ఱన్న పూ తణ్ ముడియఱ్కు నల్ పల తామరై నాణ్మలర్ కైయఱ్కు ఎన్ విఱ్పురువక్కొడి తోఱ్ఱతు మెయ్.

కల్పవృక్షములయొక్క తోపులవలెనున్న విలక్షణములై యనేకములైన భుజములుగల వాఁడును, ఉజ్జ్వలమైన స్వర్ణపర్వతమువలెనున్న సుందరమై యనుకూలమైన కిరీటముగలవాఁడును, అందములై యనేకములై తామరయొక్క అభినవములైన పుష్పములవంటి చేతులుగలవాఁడునైన శ్రియఃపతివిషయమై ధనుస్సువలెనున్న కనుబొమ్మలుగలదై తీగెవలెనున్న నాకుమార్తె పోఁగొట్టుకొనినది శరీరమును.

తా. శ్రియఃపతియొక్క బంగారుకొండవలె నత్యుజ్జ్వలమైన కిరీటమును, తామరసపుష్పములవంటి హస్తములను, కల్పకవృక్షములవంటి భుజములను సేవింప నాశఁబడిన యీమెయొక్క శరీరము శిథిలమయినది. ... ౬

మెయ్యమర్ పల్ కలన్ నన్గణిన్దానుక్కు *
పైయరవినణై ప్పళ్ళియినానుక్కు *
కై యొడుకాల్ శెయ్య కణ్ణపిరానుక్కు * ఎన్
తైయలిழన్దతు తన్నుడై చ్చాయే. 2

మెయ్ అమర్ పల్ కలన్ నన్గు అణిన్దానుక్కు పై అరవిన్ అణై పళ్ళియినానుక్కు కై యొడు కాల్ శెయ్య కణ్ణన్ పిరానుక్కు ఎన్ తైయల్ ఇழన్దతు తన్నుడై శాయ్.

తిరుమేనియం దమరియున్న యనేకవిధము లైన తిరువాభరణముల నందముగా నలంకరించుకొనినవాఁడును, విశాలమైన ఫణములుగల యాదిశేషుఁ డనెడి శయ్యమీఁదఁ బవ్వళించినవాఁడును, శ్రీహస్తములతోఁగూడ శ్రీపాదములు నెఱ్ఱనైన వాఁడును, భవ్యుఁడు నైన ఉపకారకునికి నాపిల్ల పోఁగొట్టుకొనినది తనయొక్క లావణ్యమును.

తా. సకల దివ్యాభరణభూషితుఁడై క్షీరాబ్ధియందుఁ బవ్వళించియున్న శ్రియఃపతియొక్క దివ్యావయవములను స్మరించి యీమె తన శరీరలావణ్యమును ధారపోసికొనెను. ... ... ... ... 2

శాయక్కురున్దమ్ ఒశిత్తతమియుక్కు *
మాయచ్చకడమ్ ఉదైత్తమణాళుక్కు *
పేయైప్పిణమ్పడ ప్పాలుణ్ పిరానుక్కు * ఎన్
వాళక్కుழలి ఇழన్దతుమాణ్పే. 3

కురున్దమ్ శాయ ఒశిత్త తమియుక్కు శకడమ్ మాయ ఉదైత్త మణాళుక్కు పేయై పిణమ్ పడ పాల్ ఉణ్ పిరా

అసురరూపిమైన బండి గురిగింజవృక్షమును గ్రిందఁబడునట్లు పడఁద్రోసిన అసహాయవీరుఁడును, శకటాసురుఁడు మాయునట్లు తన్నిన నాయకుఁడును, పూతనను శవమై పడునట్లు దాని స్తన్యము నారగించిన ఉపకారకుఁడు నైన శ్రియః

నుక్కు ఎన్ వాళక్కుములి ఇఱున్దతు మాణ్బు.

పతిని యాశ్రయించబడి పరిమళించుచున్న కొప్పుగల దైన నాకొమార్తె పోఁగొట్టుకొనినది . సౌందర్యమును.

తా. శ్రీకృష్ణునియొక్క పూతనాశకటాసురవధాది దివ్యచేష్టితముల ననుసంధించి యీామె తన స్త్రీత్వధర్మమును దారపోసికొనినది. ... ౮

మాణ్బమైక్కోలత్తు ఎమ్మాయక్కు అళఱుక్కు *
శేణ్సుడర్ క్కున్ఱన్న శెఞ్జుడర్ మూర్త్తిక్కు *
కాణ్బెరుఙ్దోళ్ నత్తు ఎజ్కాకుత్తనమ్బిక్కు * ఎన్
పూణ్బునై మెన్ ములై తోఱ్ఱదుపాత్తే.

మాణ్బు అమై కోలమ్ ఎమ్మాయమ్ కు అళఱుక్కు శేణ్ శుడర్ కున్ఱన్న శెమ్ శుడర్ మూర్త్తిక్కు కాణ్ పెరు తోఱ్ఱమ్ ఎమ్ కాకుత్థ నమ్బిక్కు ఎన్ పూణ్బునై మెన్ ములై తోఱ్ఱతు పాఱ్ఱు.

సౌందర్య మమరియున్న అలంకారముగల ఆశ్చర్యదివ్యచేష్టితుఁడైన పొట్టివాఁడును, ఉన్నతమై తేజోమయమైన పర్వతమువలె నెఱ్ఱని కాంతిగల విగ్రహముగలవాఁడును, ఎల్లరచేఁ జూడఁదగినదై యపరిచ్ఛిన్నమైన యవతార మహిమగల మాయొక్క చక్రవర్తితిరుమకనారునైన శ్రియఃపతిని యాశ్రయించబడి ఆభరణములచే నలంకరింపఁబడిన మృదువైన స్తనములుగల నాకొమార్తె పోఁగొట్టుకొనినది (ఆభరణ) శోభను.

తా. ఈమె వామనావతారముయొక్క రూపచేష్టితములను శ్రీరామావతారమహిమను ననుసంధించి తనరూపమును బోఁగొట్టుకొనెను. ... ౯

పొఱ్పమైనీళ్ ముడి పూన్దణ్డుళాయుక్కు *
మఱ్పొరుతోళుడై మాయప్పిరానుక్కు *

నిఱ్ప్పనపల్లురువాయ్ నిఱ్కుమాయఱ్కు * ఎన
కఱ్పుడై యాట్టి ఇழన్దదుకట్టే. ౧౦

పొఱ్పు అమై నీళ్ ముడి పూ తణ్ తుழాయ ఱ్కు మల్ పొరు తోళుడై మాయమ్ పిరానుక్కు నిఱ్ప్పన పల్ ఉరువాయ్ నిఱ్కుమ్ మాయఱ్కు ఎన కఱ్పుడై యాట్టి ఇழన్దదు కట్టు.

సౌందర్య మమరియున్న దీర్ఘమైన కిరీటమును స్పృహణీయమై చల్లనైన తిరుత్తుழాయిమాలను గలవాఁడును, మల్లులతో యుద్ధముఁజేసిన భుజములుగల ఆశ్చర్యభూతుఁడును, ఉపకారకుఁడును, జంగమస్థావరరూపములై యున్న యనేకవిధములైన వస్తువుల కంతర్యామియై యున్నవాఁడును, వానియొక్క దోషములచేత నస్పృష్టుఁడైన ఆశ్చర్యభూతుఁడునైన శ్రియఃపతిని యాశఁబడి బుద్ధిమంతురాలైన నాకుమార్తె పోఁగొట్టుకొనినది లోకమర్యాదను.

తా. మల్లయుద్ధముఁజేసిన శ్రీకృష్ణునియొక్క భుజములను, ఆధిరాజ్య సూచకమైన తులసీమాలికను సర్వాంతరాత్మత్వమును ధ్యానించి స్త్రీలుండవలసిన లోకరీతిని వదలి స్వతంత్రురాలైనది. ... ... ౧౦

* కట్టెழిల్ శోలై నల్ వేఙ్గడవాణనై *
కట్టెழిల్ తెన కురుకూర్ చ్చడకోపన శొల్ *
కట్టెழిలాయిరత్తు ఇప్పత్తుమ్వల్లవర్ *
కట్టెழిల్ వానవర్ పోకముణ్బారే. ౧౧

కట్టు ఎழిల్ శోలై నల్ వేఙ్గడమ్ వాణనై కట్టెழిల్ తెన కురుకూర్ శడకోపన శొల్ కట్టెழిల్ ఆయి

పరిమళముగల సుందరమైన తోపులుగల విలక్షణమైన వేంకటాద్రికి స్వామియైన శ్రియఃపతివిషయమై ప్రాకారములచే నందమై స్పృహణీయమైన కురుకాపురికి స్వామియైన నమ్మాళ్వార్లు ప్రసాదించిన మంచిశబ్దసందర్భముగల

రత్తు ఇప్పత్తుమ్ వల్లవర్ కట్టై త్తీల్ వానవర్ భోగమ్ ఉణ్బార్.

వేయిపాశురములలోఁ జేరిన ఈపదిపాశురముల నభ్యసించువారు సంపూర్ణముగా నందమైయున్న (అప్రతిహతమైన) నిత్యసూరులయొక్క భోగము ననుభవింతురు.

తా. అతి రమణీయమైన వేంకటాద్రియందు వేంచేసియున్న శ్రియఃపతివిష యమై నమ్మాళ్వార్ల ప్రసాదించిన యీపదిపాశురముల ననుసంధించువారు నిత్య సూరులవలె మోక్షమందు నిరతిశయానందము ననుభవింతురు. ... ౧౧

షష్ఠశతకములో షష్ఠదశకము ముగిసెను.

ఆళ్వార్ ఎమ్బెరుమానార్ జీయర్ తిరువడికళే శరణమ్.

---

తిరువాయ్ మొళి - షష్ఠశతకములో

## సప్తమదశకము — ఉణ్ణుజ్ఞోఱు

అవతారిక:—సర్వేశ్వరుఁడు ప్రత్యక్షముగవచ్చి సేవసాదింపనందున నాయికావస్థనుబొంది మోహించియున్న యాళ్వార్లనెడి పిరాట్టియొక్క సమీప మందుండి తల్లిగారు చెప్పుచున్న భగవన్నామములను విని మోహమువదలి తిరు క్కోళూరికి వేంచేసిరి. అప్పుడు తల్లిగారు ఆళ్వార్లను బడఁయందుఁ జూడక కొంతసేపు విచారించి వారి గుణములనుబట్టి మాపిల్ల తిరుక్కోళూరికే పోయిన దని నిశ్చయించి చెప్పుచున్నారు. ... ... ... *

* ఉణ్ణుమ్శోఱుపరుకునీర్ తిన్నుమ్వెత్తిలై యుమెల్లామ్
కణ్ణన్ * ఎమ్బెరుమానెన్టెన్టే కణ్గళ్ నీర్ మల్కి *
మణ్ణినుళ్ అవన్శీర్ వళమ్మిక్కవనూర్ వినవి *
తిణ్ణమెన్నిళమాన్ పుకుమూర్ తిరుక్కోళూరే. ౧

ఉణ్ణుమ్ శోఱుమ్ పరుకుమ్ నీరుమ్ తిన్నుమ్ వెత్తిలైయుమ్ ఎల్లామ్ కణ్ణన్ ఎమ్ పెరుమాన్ ఎన్ఱెన్ఱే కణ్గళ్ నీర్ కళ్ మల్కి మణ్ణినుళ్ అవన్ శీర్ వళమ్ మిక్కవన్ ఊర్ వినవి ఎన్ ఇళమాన్ పుకుమూర్ తిరుక్కోళూరే తిణ్ణమ్.

తినుచున్న ప్రసాదమును, పానముఁ జేయుచున్న జలమును, నమలుచున్న తాంబూలమును ఇవన్నియు శ్రీకృష్ణుండైన మనస్వామియే యని పలుమాఱు చెప్పుచు నేత్రములలో నీరును బ్రవహింపఁజేయుచు భూమియందు శ్రియఃపతి యొక్క కల్యాణగుణములచేతను సంపత్తుచేతను పూర్ణమైనవానియొక్క దివ్యదేశము నడుగుచు నాచిన్నది ప్రవేశించెడి దివ్యదేశము తిరుక్కోవలూరే; (ఇది) నిశ్చయము.

తా. శ్రియఃపతినే ధారక పోషక భోగ్యములుగా నెంచి, మార్గమందుఁ గనుపడువారిని జూచి తిరుక్కోళూరికి మార్గమేది? అచ్చట వేంచేసియున్న శ్రియఃపతియొక్క గుణంబు లెట్టివి? అని యడుగుచు నాపిల్ల తిరుక్కోళూరికే వెళ్ళినది. ఇందుకు సందియంబు లేదు. ... ... ౧

ఊరుమ్నాడుములకముమ్ తన్నైప్పోల్ * అవనుడైయ
పేరుమ్తార్ గళుమేపిదఱ్ఱ క్కఱ్ఱువానిడటి *
శేరునల్వళఞ్జేర్ పళన త్తిరుక్కోళూర్ క్కే *
పోరుఙ్గొలురైయీర్ కొడియేన్కొడి పూవైకళే. ౨

ఊరుమ్ నాడుమ్ ఉలకముమ్ తన్నైప్పోల్ అవనుడైయ పేరుమ్ తార్కళుమ్ పితఱ్ఱ వాన్ కఱ్ఱు ఇడటినల్ వళమ్ శేర్ పళనమ్ తిరుక్కోళూర్ క్కే శేఱుమ్ కొడియేన్ కొడి పోఱుమ్ ౨

ఊరిలోనున్నవారిని దేశమందున్నవారిని లోకమందున్నవారిని తనవలనే యా శ్రియఃపతి యొక్క తిరునామములను తిరుమాలలను జపించునట్లుచేసి అతిక్రమించుట కశక్యమైన లోకమర్యాద నతిక్రమించి విలక్షణమైన సంపద చేరియున్న పొలములుగల తిరుక్కోళూరికే పోయిచేరినదియు పాపిష్ఠురాలైన నాయొక్క కొమార్తె

కొల్ పూవైకళే ఉఱై యీాన్. — యైనదియు తీగెవలె నున్నదియు నైన యీామె తిరిగివచ్చునా! ఓచిలకలారా! చెప్పుఁడు.

తా. ఓ చిలుకలారా! లోకమంతయు భగవన్నామముల ననుసంధించునట్లుఁ జేయుచు తిరుక్కోళూరికిఁ బోయిన నాకొమార్తె తిరిగివచ్చునా? రాదా? చూచి చెప్పుఁడు. ... ... ... ... ౨

పూవై పైఙ్గిళిగళ్ పన్దుతూదై పూమ్బుట్టిల్ గళ్ *
యావైయు న్తిరుమాల్ తిరునామఙ్గళే కూవియెழుమ్ * ఎన్
పావై పోయిని త్తణ్ పழన త్తిరుక్కోళూర్ క్కే *
కోవై వాయ్ తుడిప్ప మழైక్కణ్ణోడెన్ శెయ్యుఙ్గొలో. ౩

పూవై పై ఙ్కిళికళ్ పన్దు తూతై పూ పుట్టిల్ కళ్ యావైయుమ్ తి రు మా ల్ తిరునామఙ్గళే కూవి ఎழుమ్ ఎన్ పావై ఇని తణ్ పழనమ్ తిరుక్కో ళూ ర్ క్కే పోయ్ కోవై వాయ్ తుడిప్ప మழై కణ్ణొడు ఎన్ శెయ్యుఙ్గొలో. — నానావర్ణమైన చిలకలు పచ్చని చిలకలు బంతి చిన్నపాత్రము పువ్వులుంచుకొనఁదగిన పుటికలు ఇవన్నియు శ్రియఃపతియొక్క తిరునామములే (యగునట్లు) ఉచ్చరించి యుజ్జీవించుచున్న నాకుమార్తె దీనిపైన చల్లనైన పొలములుగల తిరుక్కోళూరికే పోయి దొండపండువలెనున్న యధరము స్ఫురించునట్లు వర్షమువలె ధారధారగాఁ బ్రవహించుచున్న జలముతోనిండిన నేత్రములతోనిలిచి యేమిచేయుచున్నదో!

తా. తన విహారములనన్నింటిని వదలి శ్రియఃపతియొక్క తిరునామముల ననుసంధించుచున్న నాకొమార్తె తిరుక్కోళూరికి వెళ్ళి యచ్చట తన మనోరథమును బొందినదో! లేక పొందక యేడ్చుచున్నదో? తెలియలేదు. ... ౩

కొల్లైయెన్బర్ కొలో కుణమ్మిక్కన శెన్బర్ కొలో *
శిల్లైవాయ్ ప్పెణ్డుగళ్ అయల్ శ్చేరియుళ్ళారుమెల్లే *

శెల్వమ్మల్ కియవర్ కిడన్ద తిరుక్కోళూర్ క్కే *
మెల్లి డై నుడఙ్గ ఇళమాన్ శెల్ల మేవిన ళే. ౪

శెల్వమ్మల్ కి అవర్ కిడన్ద తిరుక్కోళూర్ క్కే మెల్ ఇడై నుడఙ్గ ఇళమాన్ శెల్ల మేవినళ్; శిన్లై వాయ్ పెణ్డుకళ్ అయత్చేరి ఉళ్ళారుమ్ శొల్లై యెన్బర్ కొలో కుణమ్మిక్కనళ్ ఎన్బర్ కొలో ఎన్లే.

ఐశ్వర్యము సంపూర్ణమై యున్న యాసర్వేశ్వరుఁడు పవ్వళించిన తిరుక్కోళూరికే మృదువైన నడుము వణఁకునట్లు చిన్నలేడివలెనున్న (నా) బాలిక పోవుటకు నిశ్చయించినది. జగడము వేయుచున్న నోరుగల (అవూరిలోనున్న) స్త్రీలును, ప్రక్కవూరిలోనున్న స్త్రీలును గుణహీనురా లనియెదరా! గుణవతి యనియెదరా! ఏమాశ్చర్యము!

తా. ఓ చిలుకలారా! తిరుక్కోళూరికి వెళ్ళిన నాపిల్లవిషయమై స్త్రీ లేమి చెప్పుచున్నారు? ఇది సిగ్గులేక లోకమర్యాద నతిక్రమించి వెళ్ళినదని చెప్పుచున్నారా? లేక, ఈమెయొక్క గుణముల నెఱింగి మంచిగుణవంతురాలని చెప్పుచున్నారా చెప్పుఁడు. ... ... ... ౪

మేవిన్ఱు నైన్దునైన్దువిళై యాడలుఱాళ్ ఎన్ శిఱు
త్తేఽపోయ్ * ఇనిత్తన్ తిరుమాల్ తిరుక్కోళూర్ క్కే *
పూవియల్ పొழிలుమ్ తడముమవన్ కోయిలుమ్ కణ్డు *
ఆవియుళ్ కళిర ఎఙ్గనేయుగక్కుఙ్గొలిన్టే. ౫

మేవి నైన్దునైన్దు విళై యాడల్ ఉఱాళ్ ఎన్ శిఱుత్తేవి పోయ్ తన్ తిరుమాల్ తిరుక్కోళూరిల్ పూ ఇయల్ పొழிలుమ్ తడముమ్ అవన్

(శ్రియఃపతియొక్క తిరుకల్యాణగుణములయందు) అవగాహించి మిక్కిలి శిథిలాంతఃకరణురాలై విహరించుటకు నాశింపదు నా యొక్క శ్రీమహాలక్ష్మివలెనున్న చిన్నదిపోయి తనకు స్వామియైన శ్రియఃపతియొక్క తిరుక్కోళూరిలో పుష్పించడమును స్వభావముగాఁగల

కోయిలుమ్ ఇని కణ్డు ఆవి ఉళ్ కుళిర ఇన్ఱు ఎజ్ఞనే ఉక క్కుఙ్గొల్

తోటలను తటాకములను నా శ్రియఃపతియొక్క కోవలను నింకమీఁదఁ జూచి హృదయములోపల చల్లపడునట్లు ఇప్పుడు ఏవిధముగ సంతోషించునో.

తా. తన విహారములనువదలి భగవద్గుణముల ననుసంధించుచున్న నా చిన్నది ఇప్పుడు తిరుక్కోళూరికి వెళ్ళి యచ్చటనున్న సకలసమృద్ధులఁ జూచి యెటుల సంతోషించుచున్నదో! ... ... ... 7

ఇన్ఱెనక్కుడవాదకన్ఱ ఇళమానినిప్పోయ్ *
తెన్ఱిశై త్తిలదమనైయ తిరుక్కోళూర్క్కే
శెన్ఱు * తన్ తిరుమాల్ తిరుక్కణ్ణుమ్ శెవ్వాయుమ్ కణ్డు *
నిన్ఱునిన్ఱునైయుమ్ నెడుఙ్కణ్గళ్ పనిమల్గవే. 8

ఎనక్కు ఇన్ఱు ఉత వాతు అకన్ఱ ఇళమాన్ పోయ్ తెన్ఱిశై తిలతమనైయ తిరుక్కోళూర్క్కే శెన్ఱు ఇని తన్ తిరుమాల్ తిరుకణ్ణుమ్ శెమ్ వాయుమ్ కణ్డు నెడు కణ్గళ్ పనిమల్క నిన్ఱునిన్ఱు నైయుమ్.

నా కిప్పుడు సహాయముగాలేక విడిచి పోయిన చిన్నది వెళ్లి దక్షిణదిక్కుకు తిలకము వలెనున్న తిరుక్కోళూరిలోఁ బ్రవేశించి దీనిపరువాత తన శ్రియఃపతియొక్క సుందరనేత్రములను నెఱ్ఱని యధరమునుఁ జూచి విశాలమైన నేత్రములలో నీళ్ళునిండునట్లు ఉండియుండి శిథిలురాలగుచున్నది.

తా. నాచిన్నది నన్నిచ్చట నొంటరిగా విడిచిపెట్టి తాను తిరుక్కోళూరికి వెళ్ళి శ్రియఃపతియొక్క యతిసుందరంబులైన దివ్యావయవములను సేవించి యానందబాష్పమును బ్రవహింపఁజేయుచు ఇప్పుడు మిక్కిలి సంతోషించుచుండును. ... ... ... ... 8

మల్ గునీర్ కణ్ణోడు మైయలుఱ్ఱమన త్తనళాయ్ *
అల్లునల్ పగలుమ్ నెడుమాలెన్ఱళైత్తినిప్పోయ్ *
శెల్వమ్మల్ గియవర్ కిడన్ద తిరుక్కోళూర్ క్కే *
ఒల్ గియొల్ గినడన్దు ఎజ్ఞనేపుగుంగొలొళిన్దే. ౨

మల్కు నీర్ కణ్ణోడు మైయల్ ఉఱ్ఱ మన త్తన ళాయ్ నల్ అల్లుమ్ పకలుమ్ నెడుమాల్ ఎన్ఱు అళైత్తు ఇని ఒల్కి ఒల్కి నడన్దు ఒళిన్దు పోయ్ శెల్వమ్ మల్కి అవర్ కిడన్ద తిరుక్కోళూర్ క్కే ఎజ్ఞనే పుకుజ్గొల్.

నిండియున్న నీళ్లుగల నేత్రములతోఁగూడ భ్రమ కొందిన మనస్సుగలదై యనుకూలమైన రేయింబగళ్లను (ఆశ్రితులయందు) మిక్కిలి వ్యామోహముగలవాఁడా! యని పిలిచి దీనిపైన శిథిలురాలై వంగి యాడియాడి (మెల్ల మెల్లగా) నడిచి వెళ్లి సంపత్తునిండియున్న శ్రియఃపతి పవ్వళించిన తిరుక్కోళూరికే యెటుల ప్రవేశించునో!

తా. శ్రియఃపతియందు మిక్కిలి వ్యామోహపడి వానినే పిలుచుచున్న నా బాలిక ఆ శ్రియఃపతి పవ్వళించియున్న తిరుక్కోళూరికి శక్తిలేక మెల్ల మెల్లగా నడిచివెళ్ళి యెట్లు చేరినదో? ... ... ... ౨

ఒశిన్దనుణ్ణిడై మేల్ కై వైత్తు నొన్దునొన్దు *
కశిన్ద నెఞ్జినళాయ్ కణ్ణనీర్ తుళుమ్బచ్చెల్లుంగొల్ *
ఒశిన్దవొణ్ మలరాళ్ కొழுనన్ తిరుక్కోళూర్ క్కే *
కశిన్ద నెఞ్జినళాయ్ ఎమ్మైనీత్తఎమ్ శారిగైయే. ౩

ఒశిన్ద ఒణ్ మలరాళ్ కొழுనన్ తిరుక్కోళూర్ క్కే కశిన్ద నెఞ్జినళాయ్ ఎమ్మై నీత్త ఎజ్గారికై ఒశిన్ద నుణ్ ఇడై మేల్ కై వైత్తు

(సంభోగముచే) వాడియున్న అందమైన పిరాట్టికి నల్ల భర్తైన శ్రియఃపతి (పవ్వళించిన) తిరుక్కోళూరికే మనస్సుకలదై మనలను విడిచి పోయిన నాబాలిక వంగియున్న సూక్ష్మమైన నడుముమీఁదఁ జేతులనుంచుకొని మిక్కిలి కష్ట

నొన్దునొన్దు కళిన్దనెఞ్జినళాయ్ పడి (ప్రేమచే) ఆర్ద్రచిత్తురాలై కన్నీళ్లు నిండు కణ్ణనీర్ తుళుమ్బ శెల్లుఙ్గొల్. నట్లు చేరునా?

తా. తిరుక్కోళూరిలో బవ్వళించియున్న శ్రియఃపతియందు మిక్కిలి వ్యామోహముగలదై నన్నిచ్చట విడిచిపెట్టిపోయిన నాబాలిక దేనిని సహాయముగాఁ జేసికొని యింత గొప్పదూరము వెళ్లినదని యాలోచించగా ఆభక్తినే సహాయముగాఁ జేసికొని వెళ్ళినదని తోచుచున్నది. ... ౮

కారియమ్‌నల్లగళవై కాణిల్ ఎన్ కణ్ణనుక్కెన్ఱు *
ఈరియాయిరుప్పాళ్ ఇదెల్లామ్‌కిడక్కవినిప్పోయ్ *
శేరిపల్ పழிతూవియిరైప్ప త్తిరుక్కోళూర్ క్కే *
నేరిழைనడన్దాళ్ ఎమ్మైయొన్ఱుమ్‌నినైత్తిలళే. ౯

నల్ల నకళ్ కాரியమ్ అవై కాణిల్ ఎన్ కణ్ణనుక్కు ఎన్ఱు ఈరిమాయ్ ఇరుప్పాళ్ నేర్ ఇழை ఇతు ఎల్లామ్ కిడక్క ఇని పోయ్ శేరి పల్ పழி తూయ్‌ఇరైప్ప తిరు క్కోళూర్ క్కే నడన్దాళ్ ఎమ్మై ఒన్ఱుమ్ నినైత్తిలళ్. - మంచివై చేయఁబడిన యాచందనకుసుమాదులను జూచినయెడల నాకృష్ణునికి యని యార్ద్రచిత్తురాలై యున్న సుందరంబులైన దివ్యాభరణములుగల యీమె ఈవస్తువులన్ని యుండగా దీనితరువాత వెళ్లి గ్రామములోనున్నవారనేక దోషములను జెప్పి ఘోషించునట్లు తిరుక్కోళూరికే వెళ్లెను. మనలను గొంచెముకూడ తలంచుచున్నదికాదు

తా. ఒక మంచివస్తువును జూచినయెడల మన శ్రీకృష్ణునికి దీనిని సమర్పించవలయునని చెప్పుచున్న నాబాలిక యిప్పుడు అవియన్నిటిని వదలి తిరుక్కోళూరికి వెళ్ళినది. లోకుల నిందను లక్ష్యపెట్టలేదు. నన్ను దలంచనుగూడలేదు. ౯

నినైక్కిలేన్ తెయ్‌వఙ్గాళ్ నెడుఙ్గణిళమానినిప్పోయ్ *
అనైత్తులగుముడైయ అరవిన్దలోచననై *

తినైత్తనైయుమ్విడాళ్ అవళ్ శేర్ తిరుక్కోళూర్క్కే *
మనైక్కువాన్పழியుమ్నినైయాళ్ శెల్లవైత్తనళే. ౧౦

తెయ్వఙ్గాళ్ నినై క్కిలేన్ నెడుకణ్ ఇళమ్మాన్ ఇని పోయ్ అనైత్తు ఉలకుముడైయ అరవిన్దలోశననై తినైత్తనైయుమ్ విడాళ్ అవళ్ శేర్ తిరుక్కోళూర్క్కే శెల్లవైత్తనళ్; మనైక్కువాన్ పழియుమ్నినైయాళ్.

ఓ దేవతలారా! (ఈదుఃఖమును నేను) స్మరింపను. విశాలమైన నేత్రములుగల చిన్న లేడివలెనున్న బాలిక ఈయవస్థకంటె పైనవెళ్లి సకలలోకములను గల కమలాక్షుని యొకక్షణము కూడ విడువదు. శ్రియఃపతి చేరియున్న తిరుక్కోళూరికే వెళ్లఁదలఁచినది. కులమునకు(వచ్చెడి) గొప్ప యపవాదమును లక్ష్యపెట్టదు.

తా. ఓ దేవతలారా! నా బాలిక మనకులమునకు సంభవించెడి లోకాపవాదమునుగూడ లక్ష్యపెట్టక తిరుక్కోళూరికి వెళ్ళి యొకక్షణముకూడ విడువక శ్రియఃపతిని యనుభవించుచున్నది. నన్ను విడిచిపోయిన యాదుఃఖమును నేను సహింపలేను. ... ... ... ... ౧౦

* వైత్తమానిదియామ్ మదుశూదనైయేయలత్తి *
కొత్తలర్ పొழிల్ శూழ் కురుకూర్చ్చడకోపన్ శొన్న *
పత్తునూత్తుళిప్పత్తు అవళ్ శేర్ తిరుక్కోళూర్క్కే *
శిత్తమ్వైత్తురైప్పార్ తిగழ் పొన్నులగాళ్ వారే ౧౧

వైత్త మానిదియామ్ మతుశూతనై అలత్తి కొత్తు అలర్ పొழிల్ శూழ் కురుకూర్ శడకోపన్ శొన్న పత్తు నూత్తుళ్ ఇప్పత్తు అవళ్

స్థాపింపఁబడిన శ్లాఘ్యమైన నిధివలెనున్న మధుసూదనునే యార్తిచేఁ జపించి పూలగుత్తులు, వికసించియున్న తోటలుగల కురుకాపురికి స్వామియైన నమ్మాழ்వార్లు ప్రసాదించిన పదిసంఖ్యగల నూఱు (వేయి) తిరువాయ్మొழிలలో నీ పదిపాశురములను శ్రియఃపతి నిత్య

శేర్ తిరుక్కోళూర్ క్కే — వాసముఁ జేయుచున్న తిరుక్కోళూరియందే
శిత్తమ్ వైత్తు ఉరైప్పార్ — మనస్సు నుంచి యధ్యయనముఁ జేయువారు
తిక్ళుమ్ పాళ్ ఉలకు ఆళ్వార్. — ప్రకాశించుచున్న శ్లాఘ్యమైన పరమపదము ననుభవింతురు.

తా. నమ్మాళ్వార్లు ప్రసాదించిన యీతిరువాయ్ మొళ్ళిని తిరుక్కోళూరనెడి దివ్యదేశమందు భక్తిగలవారై యనుసంధించువారు శ్రీవైకుంఠమందు వెళ్ళి నిత్యానందము ననుభవింతురు. ... ... ... ౧౧

షష్ఠశతకములో సప్తమదశకము ముగిసెను.
ఆళ్వార్ ఎమ్బెరుమానార్ జీయర్ తిరువడికళే శరణమ్

—

# అష్టమదశకము — పొన్నులగు

అవతారిక:— నమ్మాళ్వార్లనెడి పిరాట్టి తిరుక్కోళూరికి వేంచేయుచున్నప్పుడు శక్తిలేక మధ్యమార్గమం దొక ఉద్యానవనములోనుండి అచ్చటనున్న పక్షులను శ్రియఃపతియొద్దకు దూతలుగఁ బంపించుచున్నది. ... *

* పొన్నులగాళీరో భువనిముళ్ళుదాళీరో *
నన్నలప్పుళ్ళినఙ్గాళ్ వినైయాట్టియేన్నానిరన్దేన్ *
మున్నులగఙ్గళెల్లామ్పడైత్త ముగిల్ వణ్ణన్ కణ్ణన్ *
ఎన్నలఙ్గొణ్డపిరాన్తనక్కు ఎన్నిలైమైయురైత్తే. ౧

నన్నలమ్ పుళ్ళిన ఙ్గాళ్ — (నాయందు) మిక్కిలి స్నేహముగల ఓ పక్షిసమూహములారా!
వినైయాట్టియేన్ నాన్ — పాపముఁ జేసిన నేను
ఇరన్దేన్; — (మిమ్ములను) యాచించితిని.
మున్ ఉలకఙ్గళ్ ఎల్లామ్ పడైత్త — మునుపు లోకముల నన్నింటిని సృజించిన
ముకిల్ — మేఘమువంటి కాంతిగల

| | |
|---|---|
| వణ్ణ కణ్ణ ఎన నలమ్ కొణ్డ పిరాన్ తనక్కు ఎన నిలై మై ఉరైత్తు పోన ఉలకు ఆళీరో పువని ముழுతు ఆళీరో. | శ్రీకృష్ణుఁడైన నాగుణముల నపహరించిన స్వామికి నాయొక్కస్థితిని జెప్పి స్పృహణీయమైన శ్రీ వైకుంఠలోకము ననుభవించుఁడి. లీలావిభూతి నన్నింటిని యనుభవించుఁడి. |

తా. ఓ పక్షులారా! మీరు వెళ్ళి నన్నీవిధంబున బాధపెట్టుచున్న జగత్స్రష్టయైన శ్రియఃపతికి నాయవస్థను జెప్పినయెడల మీకు నేను నిత్యవిభూతిని లీలావిభూతిని యిచ్చెదను. మీ రనుభవింపవచ్చును. ... ౧

మైయమర్ వాళ్ నెడుఙ్గణ్ మఙ్గైమార్ మున్బ్ర *
కై యిరున్దు * నెయ్యమరిన్నడిశిల్ నిచ్చల్ పాలొడు మేవీరో *
కై యమర్ శక్కరత్తు ఎన కనివాయ్ ప్పెరుమానై క్కణ్డు *
మెయ్యమర్ కాదల్ శొల్లి క్కిళిగాళ్ విరైన్దోడివన్దే. ౨

| | |
|---|---|
| కిళికాళ్ కై అమర్ శక్కరమ్ కనివాయ్ ఎమ్బెరుమానై కణ్డు మెయ్ అమర్ కాతల్ శొల్లి విరైన్దు ఓడివన్దు మై అమర్ వాళ్ నెడుఙ్గణ్ మఙ్గైమార్ మున్బు ఎన కై ఇరున్దు నెయ్ అమర్ ఇన అడిశిల్ పాలొడు నిచ్చల్ మేవీరో. | ఓ చిలకలారా! శ్రీహస్తమం దమరియున్న సుదర్శనముగలవాఁడును దొండపండువలెనున్న తిరువధరముగలవాఁడు నైన స్వామిని జూచి వాని తిరుమేనును (సంశ్లేషింపవలయునని) చేరియున్న (నా) ఆశను జెప్పి శీఘ్రముగ పఱుగెత్తివచ్చి కాటుక అమరియున్న సుందరమై విశాలమైన నేత్రములుగల సఖియలైన స్త్రీల ముంగల నాచేతిమీఁదనుండి నెయ్యితోఁ బూర్ణమై భోగ్యమైన ప్రసాదమును పాలుతోఁగూడ ప్రతిదినమును భుజించుఁడి. |

తా. ఓ చిలకలారా! మీరు శ్రియఃపతియొద్దకువెళ్ళి "నిన్ను సంశ్లేషింపనే నాశఁబడుచున్నాను" అని నేనుచెప్పినట్లు చెప్పి తిరిగివచ్చితి రేని మిమ్ములను

నాచేతిమీఁద నుంచుకొని నెయ్యి పాలుతోఁగూడ మధురమైన ప్రసాదము నిచ్చె దను. మీా రారగింపవచ్చును. ... ... ... ౩

ఓడివన్దెకృళ్ళల్ మేల్ ఒళిమామలరూదీరో *
కూడియవణ్డినజ్గాళ్ కురునాడుడై ఐవర్ గట్ కాయ్ *
అడియమానెడున్దేర్ పడై సీతెఱ్ఱచ్చెన్ఱపిరాన్ *
శూడియతణ్ తుళపముణ్డ తూమదువాయ్ గళ్ కొణ్డే. ౩

కూడియ వణ్డినజ్గాళ్ కురునాడుడై ఐవర్ కట్కాయ్ అడియ మా నెడున్దేర్ పడై సీతెఱ్ఱ శెన్ఱ పిరాన్ శూడియ తణ్ తుళపమ్ ఉణ్డ తూమదు వాయ్ కళ్ కొణ్డు ఓడివన్దు ఎన్ కృళ్ళల్ మేల్ ఒళి మా మలర్ ఊతీర్.

గుంపుగాఁ జేరియున్న ఓ తుమ్మెదసమూహములారా! కురుదేశమునకు రాజులైన పంచ పాండవులకొఱకై అందముగా సంచరించుచున్న గుఱ్ఱములు జోడించిన గొప్పరథమును (సాధనముగాఁ జేసికొని) సేనలను భస్మమగునట్లు చంపిన శ్రీకృష్ణుఁ డలంకరించుకొనిన చల్లనైన తులసీ మాలికలలోనున్న తేనెను భుజించిన పరిశుద్ధమైన తేనెగల నోటుగలవారై పఱుగెత్తివచ్చి నా కొప్పుమీఁదఁ బ్రకాశించుచున్న శ్లాఘ్యమైన పుష్పములమీఁదనున్న మకరందమును పానముఁ జేయుఁడు.

తా. ఓ తుమ్మెదలారా! పాండవులకు సారథ్యముఁ జేసి దుర్యోధనాదులను జంపిన శ్రీకృష్ణుని వనమాలమీఁదనున్న మకరందమును ద్రాగి వానికి నామాటలను జెప్పివచ్చితిరేని నాకొప్పుమీఁదనున్న మధురమైన పుష్పమకరందమును పానముఁ జేయవచ్చును. ... ... ... ౩

తూమదువాయ్ గళ్ కొణ్డువన్దు ఎన్ ముల్లైగళ్ మేల్ తుమ్బిగాళ్ *
పూమదువుణ్ణచ్చెల్లిల్ విన్నైయేన్నై ఏన్ఱాయ్ శెయ్ దగన్న *

మామదువార్ తణ్ తుఴాయ్ ముడి వానవర్ కోనైక్కణ్డు *
యామిదువో తక్కవాఱు ఎన్న వేణ్డుజ్గణ్డీర్ నుజ్గట్కే. ౪

ఎన్ ముల్లైకళ్ మేల్ తుమ్బికాళ్ తూమతువాయ్ కళ్ కొణ్డు వన్దు పూ మతు ఉణ్ణ శెల్లిల్ వినైయేనై పొయ్ శెయ్‌తు అకన్ఱ మా మతు వార్ తణ్ తుఴాయ్ ముడి వానవర్ కోనై కణ్డు నుజ్గట్కు యామ్ ఇతువో తక్కవాఱు ఎన్న వేణ్డుజ్గణ్డీర్.

నాయొక్క ముల్లపుష్పములమీఁద సంచరించుచున్న ఓ తుమ్మెదలారా! పరిశుద్ధమై మధురమైన మాటలనుజెప్పుచు వెళ్లి పుష్పుల మీఁదనున్న తేనెను భుజించుటకు వెళ్లితిరేని పాపముగల నన్ను కృత్రిమముగా (స్వప్నమువలె క్షణకాలము) సంశ్లేషించి విడిచిపోయినవాఁడై శ్లాఘ్యమైన తేనె కారుచున్న చల్లనైన తిరుత్తుఴాయిని కిరీటమందుఁ గలవాఁడై నిత్యసూరులకు స్వామియైన శ్రియఃపతిని జూచి మీకు మేము ఇదియా దయకుఁ పాత్రమైనవిధము అని చెప్పవలయును సుమండీ.

తా. ఓ తుమ్మెదలారా! మీరు మధుపానముఁజేయ వెళ్ళినప్పుడు నన్ను క్షణమాత్రము సంశ్లేషించి విడిచిపెట్టిపోయిన శ్రియఃపతినిజూచి "నీవు స్త్రీలను బాధఁబెట్టుటయేనా" స్వభావము అని భయపడకనుండి చెప్పుఁడు. ... ౪

నుజ్గట్కు యానురైక్కేన్ వమ్మిన్ యాన్ వళర్త్త కిళిగాళ్ *
వెజ్గణ్ పుళ్ళూర్న్దు వన్దు వినైయేనై నెఞ్జగవర్న్ద *
శెజ్గణ్ కరుముగిలై చ్చెయ్య వాయ్ చ్చెఴుజ్కఱ్పగత్తై *
ఎజ్గు చ్చెన్ఱాగిలుజ్కణ్డు ఇదువో తక్కవాఱెన్ననే. ౫

యాన్ వళర్త్త కిళికాళ్ వమ్మిన్ యాన్ నుజ్గట్కు ఉరైక్కేన్ వెమ్ కణ్ పుళ్ ఊర్న్దు వన్దు వినై

నేను పెంచిన ఓ చిలకలారా! రండు. నేను మీకు (ఒకపని) చెప్పుచున్నాను. (విరోధులమీఁదఁ గోపముచే) ఎఱ్ఱనైన నేత్రములు గల గరుత్మంతుని నడిపించుకొని వచ్చి భాగ్య

యేనై నెఞ్జమ్ కవర్న్ద శెఙ్గణ్ కరుముకిలై శెయ్యవాయ్ శెఴుఙ్కఱ్పకత్తై ఎఙ్గాకిలుమ్ శెన్ఱు కణ్డు ఇతువో తక్కవాఱు ఎన్మిన్.

హీనురాలైన నాయొక్క మనస్సు నపహరించినవాఁడును, ఎఱ్ఱని నేత్రములుగలవాఁడును, నల్లని మేఘమువంటి కాంతిగలవాఁడును, ఎఱ్ఱని యధరముగలవాఁడును, సుందరమైన కల్పవృక్షమువంటివాఁడు నైన శ్రియఃపతి నెచ్చటనైనను వెళ్ళి చూచి ఇదియా నీదయ యని చెప్పుఁడు.

తా. ఓ చిలకలారా! మీకొకపనిచెప్పెదను రండు. గరుత్మంతునిమీఁద వేంచేసి వచ్చి యతిసుందరంబులైన దివ్యావయవములచే నన్ను మోహపఱచి పోయిన శ్రియఃపతిని వెదకి గనిపెట్టి "స్త్రీలను బాధించుటయేనా ? నీదయ" అని యడుగుఁడు. ... ... ... ... ౫

ఎన్మిన్నునూల్మార్వన్ ఎన్కరుమ్బెరుమానెన్కణ్ణన్ *
తన్మన్నునీళ్ కఴల్మేల్ తణ్డుఴాయ్ నమక్కన్ఱినల్గాన్ *
కన్మిన్గళెన్నుమ్మైయాన్ కఱ్పియావైత్తమాఱ్ఱమ్శొల్లి *
శెన్మిన్గళ్ తీవినైయేన్ వళర్త్తశిఱుపూవైగళే. ౬

తీవినైయేన్ వళర్త్త శిఱు పూవైకళే! ఎన్ మిన్ను నూల్ మార్వన్ ఎన్ కరుమ్బెరుమాన్ ఎన్ కణ్ణన్ తన్ నీళ్ కఴల్ మేల్ మన్ను తణ్ తుఴాయ్ నమక్కు అన్ఱి నల్గాన్; కన్మిన్గళెన్ఱు ఉమ్మై యాన్ కఱ్పియా వైత్త మాఱ్ఱమ్ శొల్లి శెన్మిన్గళ్.

క్రూరమైన పాపముగల నేను పెంచిన ఓ చిలకలారా! ప్రకాశించుచున్న యజ్ఞోపవీతముచే నలంకరింపఁబడిన వక్షస్థలముగలవాఁడై నాకు సేవసాదించినవాఁడును, నాకు సేవసాదించిన శ్యామవిగ్రహముగల స్వామియు, నాకు భవ్యుఁడు నైన శ్రీకృష్ణుఁడు తనయొక్క పొడవైన తిరువడికళమీఁద నమరియున్న చల్లనైన తిరుత్తుழాయిని మనలను తప్ప మఱియొకరికిఁ బ్రీతిలో నివ్వఁడు. అభ్యసించుడి యని మిమ్ములనుగుఱించి నేను చెప్పించిన మాటలను జెప్పి వెళ్లుఁడు.

తా. ఓ చిలకలారా! ఇదివఱలో నాకు నత్యంతభవ్యుఁడై చక్కఁగా సేవ సాదించుచు తాను సమర్పించుకొనియున్న తిరుత్తుழாయిని నాకుఁ బ్రసాదముగా నిచ్చి నామనోరథమును బూర్తిజేయు శ్రియఃపతినిజూచి ఇప్పుడు నన్నొడఁబాసి యిట్లు బాధఁబెట్టవచ్చునా యని నేనుచెప్పిన ట్లడుగుఁడు. ... ౬

పూవైగళ్ పోల్ నిఱత్తన్ పుణ్డరీకఙ్గళ్ పోలుమ్ కణ్ణన్ *
యావైయుమ్ యావరుమాయ్ నిన్ఱమాయనెన్నాழிప్పిరాన్ *
మావైవల్ వాయ్ పిళన్ద మదుశూదఱ్కెన్ మాత్తమ్ శొల్లి *
పావైగళ్ తీర్క్కిఱ్ఱిరే విన్నైయాట్టియేన్పాశఱవే. ౭

పూవైకళ్ పోల్ నిఱత్తన్ పుణ్డరీకఙ్గళ్ పోలుమ్ కణ్ణన్ యావైయుమ్ యావరుమ్ ఆయ్ నిన్ఱ మాయన్ ఎన్నాழிప్పిరాన్ మావైవల్ వాయ్ పిళన్ద మతుశూతఱ్కు ఎన్ మాత్తమ్ శొల్లి పావైకళ్ విన్నైయాట్టియేన్ పాశఱవు తీర్క్కిఱ్ఱిరే.

కల్లుపువ్వువంటి కాంతిగలవాఁడును, పద్మములతో సమానంబులైన నేత్రములుగలవాఁడును, సమస్తచేతనములకును సకలచేతనులకు నంతర్యామియై యున్నవాఁడును, (వానిదోషములుతెగలని) ఆశ్చర్యశక్తిగలవాఁడును, నాకు స్వామియు చక్రాయుధుఁడైన ఉపకారకుఁడును, గుఱ్ఱమైవచ్చిన కేశియొక్క క్రూరమైన నోటిని జీల్చినవాఁడు నైన మధుసూదనునికి నామాటలనుజెప్పి ఓ బొమ్మలారా! పాపముగల నాయొక్క దుఃఖమును దీర్చుదురా?

తా. ఓ బొమ్మలారా! పరమసుందరుఁడై, సకలాంతర్యామియై, సమస్తశత్రుసంహారకుఁడైన శ్రియఃపతికి నామాటనుజెప్పి మీరు నాదుఃఖమును బోఁగొట్టవలయును. ... ... ... ... ౭

పాశఱవెయ్ దియిన్నే విన్నైయేనెన్నైయూழிనైవేన్ *
ఆశఱుతూవివెళ్లైక్కుఱుగే అరుళ్ శెయ్ దొరునాళ్ *

మాశఱునీలచ్చుడర్ముడి వానవర్ కోనై క్కణ్డు *
ఏశఱుమ్ నుమ్మైయల్లాల్ మఱునోక్కిలళ్ పేర్త్తుమన్ నే. ౮

ఆశు అఱు తూవి వెళ్లై
కురుకే! విన్నై యోడ పాళఱవు
ఎయ్ది ఇన్నే ఎన్నై యూళి
నై వేడ? మాశఱు నీలచ్చు
డర్ ముడి వానవర్ కోనై
కణ్డు ఏశు అఱు నుమ్మై
అల్లాల్ పేర్ త్తు మఱ్ఱు
మఱునోక్కిలళ్ ఎన్ఱు శొల్లి
ఒరునాళ్ అరుళ్ శెయ్.

దోషములేని ఱెక్కలుగల తెల్లనివర్ణము గల ఓ కొంగా! పాపియైన నేను వైవర్ణ్యమును బొంది యీవిధముగా నెంతకాలము బాధఁబడెదను? దోషములేని శ్యామమైన కాంతిగల కేశపాశముఁగల నిత్యసూరులకు స్వామియైన శ్రియఃపతినిజూచి దోషములేని మిమ్ములనుదప్ప మఱియు నింకొకరిని తిరిగిచూడదు అని చెప్పి యొకదినము కృపఁజేయుము.

తా. ఓ కొంగా! నేనెంతకాల మిట్లు బాధపడెదను? గాన నీవు నాయందుఁ గృపఁజేసి శ్రియఃపతియొద్దకు వెళ్లి మఱియొకరిని జూడక నిన్నే నమ్మికొని యున్న "వీరిని నీవి ట్లుపేక్షింపవచ్చునా? కటాక్షింపరాదా?" యని చెప్పుమా.౮

పేర్త్తుమఱ్ఱోర్ కళైకణ్ విన్నైయాట్టియోడ నానొన్ఱిలేన్ *
నీర్త్తిరై మేలులవి ఇరై తేరుమ్ పుదావినఙ్గాళ్ *
కార్త్తిరళ్ మాముగిల్ పోల్ కణ్ణన్ విణ్ణవర్ కోనై క్కణ్డు *
వార్త్తైగళ్ కొణ్డరుళియురైయీర్ వైగల్ వన్దిరున్దే. ౯

నీర్ తిరై మేల్ ఉలవి
ఇరై తేరుమ్ పుదావినఙ్గాళ్!
విన్నై యాట్టియోడ నాన్
పేర్ త్తు మఱ్ఱు ఓర్ కళై
కణ్ ఒన్ఱు ఇలేన్; కార్

జలములయొక్క యలలమీఁద సంచరించి యాహారమును వెదకుచున్న పెద్దకొంగ పక్షి సమూహములారా! పాపిష్ఠురాలైన నేను నిన్ను దక్క వేఱైన యద్వితీయరక్షకుని యొకని గల దానిని కాను. వర్షాకాలమందుఁ జేరియున్న గొప్ప

తిరళ్ మాముకిల్ పోల్ కణ్ణ విణ్ణవర్ కోనై కణ్డు వార్త్తైకళ్ కొణ్డు అరుళి వన్దిరున్ద వైకల్ ఉరై యీర్.

మేఘమువంటి (కాంతిగలవాఁడై) ఆశ్రితభవ్యుఁడై నిత్యసూరులకు స్వామియైన శ్రియఃపతినిజూచి (వాఁడుసెప్పెడు) మాటలను దీసికొనివచ్చి (నా యందు) కృపఁజేసి ప్రీతిగలవారై యుండి ప్రతిదిన ముచు చెప్పుఁడు.

తా. ఓ పెద్దకొంగపక్షులారా! మీకంటె నన్నిప్పుడు రక్షించువా రెవ్వ రును లేరు గాన మీరు వెళ్లి శ్రియఃపతికి నామాటను జెప్పి వాఁడుసెప్పెడు బదులు మాటలను తిరిగి నాకువచ్చి చెప్పి న న్నుజ్జీవింపించుఁడు. ... ౯

వన్దిరున్దుమ్ముడైయ మణిచ్చేవలుమ్నీరుమెల్లామ్ *
అన్దరమొన్ఱుమిన్ఱి అలర్ మేలశైయుమన్నఙ్గాళ్ *
ఎన్తిరుమార్వఱ్కెన్నై ఇన్నవాఱివళ్ కాణ్మినెన్ఱు *
మన్దిరత్తొన్ఱుణర్త్తియురైయీర్ మఱుమాఱ్ఱఙ్గళే. ౧౦

వన్దు ఇరున్దు ఉమ్ముడైయ మణి శేవలుమ్ నీరుమ్ ఎల్లామ్ ఒన్ఱుమ్ అన్దరమిన్ఱి అలర్ మేల్ అశైయుమ్ అన్నఙ్గాళ్! ఎమ్ తిరు మార్వఱ్కు ఎన్నై ఇవళ్ ఇన్నవాఱు కాణ్మినెన్ఱు మన్దిరత్తు ఒన్ఱు ఉణర్త్తి మఱుమాఱ్ఱఙ్గళ్ ఉరై యీర్.

వచ్చియుండి మీయొక్క శ్లాఘ్యమైన మొగపక్షియు మీరును మీబంధువులందరు నొక బాధయు లేక పుష్పములమీఁద సంచరించుచున్న ఓ హంసపక్షులారా! నాస్వామినియైన పిరాట్టిని వక్షఃస్థలమందుఁగల శ్రియఃపతికి నన్నుద్దేశించి ఈవిధముగానున్నది చూడుమని యేకాంతమం దొకమాటను బోధించి బదులుమాటను జెప్పుఁడు.

తా. సపరివారముగా పుష్పములమీఁద సంచరించుచున్న ఓ హంసపక్షు లారా! మీరు శ్రియఃపతియొద్దకు వెళ్లి ఇట్లు బాధపడుచున్న యీమెను గటా

క్షింపరాదా యని చెప్పిన దానికి వాఁడేమి బదులుచెప్పునో దానిని నాకువచ్చి చెప్పుఁడు. ... ... ... ... ౧౦

* మాశ్ఱఙ్గళాయ్ న్దుకొణ్డు మదుశూదపిరానడిమేల్ *
నాశ్ఱఙ్గొళ్ పూమ్బొళ్ళిల్ శూళ్ కురుగూర్ చ్చడగోపఞ్ శొన్న *
తోశ్ఱఙ్గళాయిరత్తుళ్ ఇవైయుమోర్ పత్తుమ్ వల్లార్ *
ఊశ్ఱిన్ కణ్ నుణ్మణల్ పోల్ ఉరుకానిఱ్పర్ నీరాయే. ౧౧

మాశ్ఱఙ్గళ్ ఆయ్ న్దు కొణ్డు మదుశూదప్ పిరాఞ్ అడిమేల్ నాత్తమ్ కొళ్ పూమ్బొళ్ళిల్ శూళ్ కురుకూర్ శడకోపఞ్ శొన్న తోశ్ఱఙ్గళ్ ఆయిరత్తుళ్ ఒరు ఇవై పత్తుమ్ వల్లార్ ఊశ్ఱిన్గణ్ నుణ్ మణల్ పోల్ నీరాయ్ ఉరుకానిఱ్పర్.

మంచిశబ్దములను బరిశీలించుకొని మధువుని జంపిన ఉపకారకునియొక్క శ్రీపాదములవిషయమై పరిమళముగల పుష్పములుగల తోటలచేఁ జుట్టఁబడిన తిరునగరికి స్వామియైన నమ్మాళ్వార్లు ప్రసాదించిన అవతారరూపములైన వేయిపాశురములలో నద్వితీయములైన ఈపదిపాశురముల నభ్యసించువారు చెలమయందున్న సూక్ష్మమైన యిసుకవలె జలమై కరుగుదురు.

తా. శ్రియఃపతివిషయమై యనాదియైయున్న ద్రావిడవేదరూపమైన తిరువాయ్ మొళ్ళిని సాక్షాత్కరించి నమ్మాళ్వార్లు సాదించిన వేయిపాశురములలోఁ జేరిన యీపదిపాశురముల నభ్యసించువారు నమ్మాళ్వార్లవలెనే మిక్కిలిభక్తిచేఁ గరుగుదురు. ... ... ... ... ౧౧

సప్తశతకములో అష్టమదశకము ముగిసెను.

ఆళ్వార్ ఎమ్బెరుమానార్ జీయర్ తిరువడికళే శరణమ్.

శ్రీమద్వరవరమునయే నమః.

తిరువాయ్ మొழி - షష్ఠశతకములో

# నవమదశకము — నీరాయ్ నిలనాయ్

అవతారిక:—ఈ తిరువాయ్ మొழிలో శ్రియఃపతియొద్దకు దూతలనుబంపి నను వాఁడు రానందున పరమపదమునందు వేంచేసియున్నవానికి వినునట్లు తానే గొప్పధ్వనిచేసి పిలుచుచున్నారు. ... ... ... *

* నీరాయ్ నిలనాయ్ తీయాయ్ క్కాలాయ్ నెడువానాయ్ *
శీరార్ శుడర్ కళిరణ్డాయ్ శివనాయయనానాయ్ *
కూరారాழிవెణ్శజ్ఞేన్ది క్కొడియేన్బాల్
వారాయ్ * ఒరునాళ్ మణ్ణుమ్విణ్ణుమ్మగిழவే. ౧

నీరాయ్ నిలనాయ్ తీయాయ్ కాలాయ్ నెడు వాన్ ఆయ్ శీరార్ ఇరణ్డు శుడర్ కళాయ్ శివనాయ్ అయనానాయ్ కూర్ ఆర్ ఆழி వెణ్ శజ్ఞు ఏన్ది మణ్ణుమ్ విణ్ణుమ్ మకిழ కొడియేన్బాల్ ఒరునాళ్ వారాయ్.

జలస్వరూపుఁడై భూమియై యగ్నియై గాలియై విశాలమైన ఆకాశమై (సకలకారణ స్వరూపుఁడై యీపదార్థములను సృజించి వీనికి నంతర్యామియై, ప్రకాశముతోఁ బూర్ణులై తేజో రూపులైన (చంద్రసూర్యులనెడి) యిద్దఱికి నంత ర్యామియై రుద్రాంతర్యామియై బ్రహ్మాంత ర్యామియై యున్న ఓ శ్రియఃపతీ! వాఁటిచేఁ బూర్ణమైన సుదర్శనమును తెల్లనైన పాంచజన్య మును ధరించి లీలావిభూతియు నిత్యవిభూతియు సంతోషించునట్లు పాపియైన నాయొద్దకు నొక దినము వేంచేయుమా!

తా. సకలకార్యకారణస్వరూపుఁడవైన ఓ శ్రియఃపతీ! నిన్ను సేవింపక నాస్తికుఁడనైన నేను ఘోషించగా నాఘోషముచే నుభయవిభూతియు నేఁడుఖ

చున్నవి. అట్లు దుఃఖకుండ సుఖపడునట్లు నీవు శంఖచక్రధరుఁడవై నాముందఱ వేంచేసి సేవసాదించుమా. ... ... ... ౧

వణ్ణుమ్‌విణ్ణుమ్‌మగిழ క్కుఱళాయ్‌వలజ్గాట్టి *
మణ్ణుమ్‌విణ్ణుమ్‌కొణ్డ మాయవమ్మానే *
నణ్ణియునై నాళ్ కణ్డుగన్దుకూత్తాడ *
నణ్ణియొరునాళ్ ఞాలత్తూడేనడవాయే. ౨

మణ్ణుమ్ విణ్ణుమ్ మకిழ కుఱళాయ్ వలమ్ కాట్టి మణ్ణుమ్ విణ్ణుమ్ కొణ్డ మాయమ్ అమ్మానే ఉనై నాళ్ నణ్ణి కణ్డు ఉకన్దు కూత్తాడ నణ్ణి ఒరునాళ్ ఞాలత్తూడే నడవాయ్.

భూలోకమును స్వర్గాదులు నానందించునట్లు వామనబ్రహ్మచారివై సౌందర్యమనెడు బలమును (మహాబలికి) చూపించి భూలోకమును నూర్ధ్వలోకములను స్వీకరించిన ఆశ్చర్యభూతుఁడవైన ఓ స్వామీ! నిన్ను నేను సమీపించి సేవించి సంతోషించి నర్తనముఁజేయునట్లు (నన్ను)సమీపించి యొకదినము భూమియందు సంచరించుమా.

తా. సకలలోకములను సేవించి యానందించునట్లతిసుందరమైన వామనావతారంబెత్తి తన సౌందర్యముచే మహాబలిని మోహపెట్టి సమస్తలోకముల నాక్రమించిన ఓ స్వామీ! అప్పుడు వారికి సేవసాదించినట్లు నాకిప్పుడు సేవసాదించి నన్ను సంతోషపెట్టుమా. ... ... ౨

ఞాలత్తూడేనడన్దునిన్ఱుమ్ కిడన్దిరున్దుమ్ *
శాలప్పలనాళ్ ఉగన్దోఱుయిర్‌గళ్ కాప్పానే *
కోలత్తిరుమామగళోడు ఉనైక్కూడాదే *
శాలప్పలనాళ్ అడియేనిన్నమ్‌తళర్వేనో. ౩

ఉకన్దోఱు ఞాలత్తూడే నడన్దుమ్ నిన్ఱుమ్ కిడన్దుమ్ ఇరు

ప్రతి యుగమునందును భూమియందు (దండకావనమందు) సంచరించియు (శ్రావణ

న్దుమ్ శాలప్పలనాళ్ ఉయిర్ కళ్ కాప్పానే కోలమ్ తిరు మామకళోడు ఉన్నై క్కూడాతే శాలప్పలనాళ్ అడియేన్ ఇన్నుమ్ తళర్వేనో.

వధానంతరము) నిలిచియు (సముద్రతీరమందు) పవ్వళించియు (సీతాపిరాట్టితోఁగూడ) వేంచేసియుండియు చిరకాలము ప్రాణులను రక్షించువాఁడా! సౌందర్యముగల పెరియపిరాట్టితోఁ గూడ నిన్ను చిరకాలము పొందక దాసుఁడనైన నేను ఇంకను శిథిలుఁడనగుదునా?

తా. ఓ శ్రియఃపతీ! రామావతారమందు భూలోకమందు జిరకాలము వేంచేసియుండి లోకులకు పలువిధములుగా సేవసాదించి రక్షించిన నీవు పెరియ పిరాట్టితోఁగూడ వేంచేసియున్నప్పుడు ఆశేశ్త్రిని సేవింపక నేనింక నెంతకాలమిట్లు బాధపడవలెనో? ... ... ... ... 3

తళర్న్దుమ్ముఱిన్దుమ్ శగడవసురరుడల్ వేఱా *
పిళన్దువీయ త్తిరుక్కాలాణ్డ పెరుమానే *
కిళర్న్దుపిరమన్ శివన్ ఇన్దిరన్ విణ్ణవర్ శూழ *
విళఙ్గవొరునాళ్ కాణవారాయ్ విణ్మీదే. 4

శకడవసురర్ ఉడల్ తళర్న్దుమ్ ముఱిన్దుమ్ వేఱా పిళన్దు వీయ తిరుక్కాల్ ఆణ్డ పెరుమానే కిళర్న్దు పిరమన్ శివన్ ఇన్దిరన్ విణ్ణవర్ శూழ విళఙ్గ ఒరునాళ్ విణ్ మీతు కాణ వారాయ్.

శకటాసురునియొక్క యవయవము శిథిలమై విఱిగియు వేఱు వేఱుగా బద్దలై నశించునట్లు శ్రీపాదమును బరిపాలించిన ఓ స్వామీ! (నిన్ను సేవింపవలయునని) ఉద్యోగించి బ్రహ్మయు రుద్రుఁడును ఇంద్రుఁడును దేవతలును చుట్టుకొని స్తుతించగా (ఆకాశమంత) ప్రకాశించునట్లు ఒక దినము భూలోకమందు (నేను) సేవించునట్లు వేంచేయుము.

తా. ఓ స్వామీ! నీవు శకటాసురుని శ్రీపాదముతోఁ దన్ని సంహరించినప్పు డాయాశ్చర్యమునుజూచి దేవతలు గుంపుగా నాకాశమందు నిల్చి

స్తుతించునట్లు వారికి సేవసాదించిన విధంబున నాకిప్పు డొకదినము సేవ సాదించుమా. ... ... ... ... ౪

విణ్మీదిరుప్పాయ్ మలై మేల్ నిఱ్ఱాయ్ కడల్ శేర్పాయ్ *
మణ్మీదుళ్లల్ వాయ్ ఇవట్ ఱుళ్ళెజ్గుమ్ మఱైన్దురైవాయ్ *
ఎణ్మీదియన్ద పుఱఅణ్డత్తాయ్ ఎనదావి *
ఉణ్మీదాడి ఉరుక్కాట్టాదే ఒళిప్పాయో. ౫

విణ్ మీతు ఇరుప్పాయ్ మలై మేల్ నిఱ్పాయ్ కడల్ శేర్ప్పాయ్ మణ్ మీతు ఉళ్లల్వాయ్ ఇవట్ ఱుళ్ ఎజ్గుమ్ మఱైన్దు ఉఱైవాయ్ ఎణ్ మీతు ఇయన్ద పుఱమ్ అణ్డత్తాయ్ ఎనతు ఆవి ఉణ్మీతాడి ఉరు శాట్టాతే ఒళిప్పాయో.

పరమపదమందు వేంచేసియున్నవాఁడవై వేంకటాద్రియందు నిలిచినవాఁడవై క్షీరాబ్ధి యందుఁ బవ్వళించినవాఁడవై భూలోకమందు సంచరించువాఁడవై ఈపదార్థములయందు నంతట మఱిగియుండి వాసముఁ జేయువాఁడవై సంఖ్యలకు పైననున్న (అసంఖ్యేయములైన) బైటనున్న అండములలో నున్నవాఁడవైన నీవు నాయాత్మకు లోపలను బైటను సంచరించి (నీ) తిరుమేనును గనుపఱచక నే దాచుకొనెదవా?

తా. సమస్తవస్తువులయందును వ్యాపించియున్న నీవు నాలోపలనుండియు నాకుఁ గనుపడకపోయినయెడల దానిని నేనెట్లు సహింతును? ... ౫

పాయోరడివైత్తదఱ్కీళ్ ప్పరవై నిలమెల్లామ్
తాయ్ * ఓరడియాల్ ఎల్లావులగున్దడవన్ద
మాయోన్ * ఉన్నైక్కాణ్బాన్ వరున్దియెనై నాళుమ్ *
తీయోడుడన్ శేర్ మెళుగాయ్ ఉలగిల్ తిరివేనో. ౬

ఓరడి పాయ్ వైత్తు అతన్కీళ్ పరవై నిలమెల్లామ్

ఒక శ్రీపాదమునంతట వ్యాపించునట్లుంచి యాతిరువడిక్రిందనున్న సముద్రముచేఁ జుట్టఁబడిన

కాయ్ ఓరడియాల్ ఉలకు ఎల్లామ్ తడవన్ద మాయోనే! ఉన్నై క్కాణ్బాన్ ఎనై నాళుమ్ వరున్ది తీయూడు ఉడన్ శేర్ మెழுకాయ్ ఉలకిల్ తిరివేనో.

భూమియంతను గొలిచి మఱియొక తిరువడిచేత నూర్ధ్వలోకముల నన్నింటిని స్పర్శించిన ఆశ్చర్య భూతుఁడా! నిన్ను సేవించుటకై యెల్లప్పుడును బాధపడి యగ్నిలోఁగూడ చేరిన మైనమువలె లోకమందు తిరుగుదునా!

తా. ఓ శ్రియఃపతీ! సకలలోకములను గొలిచి యోగ్యులనియు నయోగ్యులనియుఁ జూడక సమస్తప్రాణులను నీ తిరువడికళచే స్పృశించి యుజ్జీవింపఁజేసిన నీ యపారకారుణ్యమును దలంచి నిన్ను సేవింప నాశపడి నశింపకుండను నిట్లు బాధపడుచున్నాను. ... ... ... ౬

ఉలగిల్ తిరియుమ్ కరుమగదియాయ్ ఉలగుమాయ్ *
ఉలగుక్కే ఓరుయిరుమానాయ్ పులవణ్డత్తు *
అలగిల్ పొలిన్ద తిశై పత్తాయవరువేయో *
అలగిల్ పొలిన్ద ఱివిలేనుక్కరుళానే. ౭

ఉలకిల్ తిరియుమ్ కరుమమ్ కతి ఆయ్ ఉలకమ్ ఆయ్ ఉలకుక్కు ఓరుయిరుమ్ ఆనాయ్ పులవణ్డత్తు అలకిల్ పొలిన్ద పత్తు తిశై ఆయ అరువే అలకిల్ పొలిన్ద ఱివిలేనుక్కు అరుళాయ్ ఓ.

లోకమందు నడుచుచున్న (చేయుచున్న) పుణ్యపాపరూపములైన కర్మములనెడి ఉపాయములకు ఫలప్రదుఁడవై, ఆకర్మముల ననుష్ఠించుచున్న యధికారులకుఁ బ్రవర్తకుఁడవై, లోకములకు నొకయాత్మయై యున్నవాఁడవై, అండమున కవతల సంఖ్యయందుఁ బూర్ణులై (అసంఖ్యేయులై) పది దిక్కులయందును వ్యాప్తులై యున్న యాత్మలకు నిర్వాహకుఁడవై యున్న శ్రియఃపతీ! అసంఖ్యేయములైన యజ్ఞానములు గల నాకు కృపఁజేయుమా. ఓ అని ఆర్తధ్వని.

తా. పుణ్యపాపములకును, సకలప్రాణులకును నీవే నిర్వాహకుఁడవై యుండగా నిన్నతిక్రమించి నేనేసాధనము ననుష్ఠించి నిన్నుబొందెదను? ౭

అఱివిలేనుక్కఱుళాయ్ అఱివారుయిరానాయ్ *
వెఱికొళ్ శోదిమూర్త్తి అడియేన్నెడుమాలే *
కిఱిశెయ్ దెన్నైప్పుఱత్తిట్టు ఇన్నమ్ కెడుప్పాయో *
పిఱిదొన్ఱఱియా అడియేన్ ఆవిదికైక్కవే. ౮

అఱివార్ ఉయిరానాయ్ వెఱికొళ్ శోది మూర్త్తి అడియేన్ నెడుమాలే! అఱివిలేనుక్కు అరుళాయ్ పిఱితు ఒన్ఱు అఱియా అడియేన్ ఆవి తికైక్క కిఱి శెయ్తు ఎన్నై పుఱత్తు ఇట్టు ఇన్నమ్ కెడుప్పాయో.

జ్ఞానవంతులను నీ కాత్మగాఁగలవాఁడవై పరిమళించుచున్న తేజోమయమైన విగ్రహము గలవాఁడవై దాసునియందు మిక్కిలి వ్యామోహముగలవాఁడవై యున్న ఓ శ్రియఃపతీ! బుద్ధిహీనుఁడనైన నాకుఁ గృపఁజేయుమా. నిన్నుదక్క వేఱొకటైన ఒక ఉపాయము నెఱుఁగని దాసుని యొక్క మనస్సు భ్రమించునట్లు ఏదో యొక యుపాయముఁజేసి నన్ను బాహ్యవిషయ(సంసార)మందు బడఁద్రోసి ఇంకను చెడగొట్టెదవో?

తా. ఓ శ్రియఃపతీ! నీ వింతకాలమువఱకు నన్ను బరిగ్రహింపనందువ నేదో యొకయుపాయముచే నన్నికను సంసారమునందుఁ బడఁద్రోసెదవో యేమో యని భయపడుచున్నాను. ... ... ... ౮

ఆవిత్తిగైక్క ఐవర్ కుమైక్కుమ్శిఱ్ఱిన్బమ్ *
పావియేనైప్పలనీకాట్టిప్పడుప్పాయో *
తావివైయమ్కొణ్డ తడన్దామరైకట్కే *
కూవికొళ్ళుమ్కాలమ్ ఇన్నమ్కుఱుగాదో. ౯

Funding: Tattva Heritage and IKS-MoE. Digitization: eGangotri.



ఆవి తిక్కైక్క ఐవర్
కుమైక్కుమ్ శిఱు ఇన్బమ్ పల
కాట్టి పావియేనై పడు
ప్పాయో? వైయమ్ తావి
కొణ్డ తడమ్ తామరైకట్కు
కూవిక్కొళ్ళుమ్ కాలమ్
ఇన్నమ్ కుఱుకాతో.

మనస్సు అల్లాడునట్లును పంచేంద్రియములు బాధించునట్లును అల్పములైన సుఖముల ననేకములను జూపించి నీవు పాపిష్ఠుఁడనైన నన్ను బాధించెదవా? భూమిని గొలిచి స్వీకరించిన విశాలములైన శ్రీపాదపద్మములయందుఁ బిలుచుకొనఁదగిన కాల మిఁకను సమీపింపదా?

తా. ఎంత గొప్ప జితేంద్రియునిగూడ వ్యాకులపఱచి చెడఁగొట్టఁదగిన క్షుద్ర సుఖములుగల యీసంసారమందు నన్నిదివఱకు నుంచి మిక్కిలి బాధపెట్టితివి. నీ తిరువడికళయందు నన్ను జేర్చుకొనఁదగిన కాల మెప్పుడు దగ్గఱవచ్చునో తెలియలేదు. ... ... ... ... *

కుఱుగామీళా ఇఱుదికూడావెనైయూழி *
శిఱుగాపెరుగా అళవిలిన్బమ్ శేర్ న్దాలుమ్ *
మఱుకాలిన్ఱి మాయోయ్ ఉనక్కేయాళాగుమ్ *
శిఱుకాలత్తైయుఱుమో అన్దో తెరియిలే. ౧౦

కుఱుకా నీళా ఇఱుతి
కూడా ఎనైయూழி శిఱుకా
పెరుకా అళవిల్ ఇన్బమ్
శేర్ న్దాలుమ్ మాయోయ్!
తెరియిల్ మఱుకాల్ ఇన్ఱి
ఉనక్కే ఆళాకుమ్ శిఱు
కాలత్తై అన్దో ఉఱుమో.

హ్రస్వము కానిదియు దీర్ఘము కానిదియు నాశములేనిదియు నెల్లప్పుడును కృశించునదియు స్థూలము కానిదియు నవధిలేనిదియునైన కైవల్యానుభవసుఖమును బొందినను ఆశ్చర్యభూతుఁడా! విచారించినయెడల మఱియొకప్పుడు లేకనే నీకే దాసుఁడై చేసెడి కైంకర్యమునకుఁ దగిన క్షణకాలమునకు అయ్యో! ఒప్పగునా?

తా వృద్ధిక్షయాదిదోషము లేమియు లేని యాత్మానుభవమని యెడి కైవల్య సుఖమును బొందినను నాసుఖము నీ కైంకర్యసుఖముతో నెంతమాత్రము నొప్పదు. ... ... ... ... ౧౦

* తెరిదల్ నినైదల్ ఎణ్ణలాగా త్తిరుమాలుక్కు *
ఉరియతొణ్డర్ తొణ్డర్ తొణ్డర్ శడగోపన్ *
తెరియచ్చొన్న ఓరాయిరత్తుళిప్పత్తు *
ఉరియతొణ్డరాక్కుమ్ ఉలగముణ్డాఱ్కే. ౧౧

తెరిదల్ నినైదల్ ఎణ్ణల్ ఆకా తిరుమాలుక్కు ఉరియ తొణ్డర్ తొణ్డర్ తొణ్డర్ శడకోపన్ తెరియ శొన్న ఓర్ ఆయిరత్తుళ్ ఇ ప్పత్తు ఉలక ముణ్డా ఱుక్కు ఉరియతొణ్డర్ ఆక్కుమ్.

శాస్త్రజ్ఞానముచేతను మననముచేతను ధ్యానముచేతను పరిచ్ఛేదించుట కశక్యుఁడైన శ్రియఃపతికి నసాధారణులైన దాసులైనవారికి దాసభూతులైనవారికి దాసులైన నమ్మాళ్వార్లు (భగవద్గుణములు) విశదములగునట్లు సాదించిన యద్వితీయములైన వేయిపాశురములలో నీ పది పాశురములును (అనుసంధించువారిని) జగ ద్రక్షకుఁడైన శ్రియఃపతికి అనన్యశేషులుగఁ జేయును.

తా. శ్రవణాదులచేఁ దెలిసికొనుట కశక్యుఁడైన శ్రియఃపతికి చరమావధి దాసులైన నమ్మాళ్వార్లు ప్రసాదించిన యీపదిపాశురముల నభ్యసించువారు భగవంతుని కత్యంతభక్తు లగుదురు. ... ... ౧౧

షష్ఠశతకములో నవమదశకము ముగిసెను.

ఆళ్వార్ ఎమ్బెరుమానార్ జీయర్ తిరువడికళే శరణమ్.

---

## దశమదశకము — ఉలగముణ్డ

అవతారిక:—ఈవిధంబున పరమపదమందు వినునట్లు తనబాధను ఘోషించిచెప్పినను శ్రియఃపతి రానందున దీనికి ప్రపత్తితప్ప మఱియొక యుపాయములేదని నిశ్చయించి తిరువేంగడముడైయాన్ తిరువడికళయందు పిరాట్టిని పురుషకారముగాఁ జేసికొని ప్రపత్తిచేయుచున్నారు. ... *

* ఉలకముణ్డపెరువాయా ఉలప్పిల్ కీర్త్తియమ్మానే *
నిలవుమ్శుడర్ శూழ்ஒళిమూర్త్తి నెడియాయడియేనారుయిరే *
తిలదములగుక్కాయ్ నిన్ఱ తిరువేఙ్గడత్తెమ్బెరుమానే *
కులతొల్లడియేనునపాదమ్ కూడుమాఱుకూఱాయే. ౧

ఉలకమ్ ఉణ్డ పెరువాయా! ఉలప్పు ఇల్ కీర్త్తి అమ్మానే! నిలవుశ్శుడర్ శూழ் ఒళి మూర్త్తి నెడియాయ్! అడియేన్ ఆరుయిరే! ఉలకుక్కు తిలతమాయ్ నిన్ఱ తిరువేఙ్గడత్తు ఎమ్బెరుమానే! కులమ్ తొల్ అడియేన్ ఉన పాతమ్ కూడుమాఱు కూఱాయ్.

లోకముల నారగించిన పెద్దనోటుగలవాఁడా! అవధిలేని యశస్సుగల ఓ స్వామీ! నిత్యమై తేజస్సుచేత వ్యాప్తమై తేజోమయమైన దివ్యవిగ్రహముగలవాఁడా! గొప్పమహిమగలవాఁడా! దాసుఁడనైన నాకుఁ బూర్ణమైన ప్రాణభూతుఁడా! లోకములకుఁ దిలకస్వరూపమై యున్న వేంకటాద్రిలో వేంచేసియున్న నా స్వామీ! కులక్రమాగతమై యనాదియైన దాస్యముగల నేను నీతిరువడికళను జేరువిధమును జెప్పుమా.

తా. నిరవధిక తేజోమయవిగ్రహుఁడవై, అనంతకల్యాణగుణాకరుఁడవై, సకలజగద్రక్షకుఁడవై భూలోకమున కలంకారభూతమైన తిరుమలయందు వేంచేసి

యున్న ఓ స్వామీ! నీ తిరువడికళను నేనేవిధముచేఁ బొందెదనో! ఆయుపాయ
మును నాకుఁ జెప్పుమా. ... ... ... ౧

కూఱాయ్ నీఱాయ్ నిలనాకిక్కొడువల్లశురర్ కులమెల్లామ్ *
శీఱావెటియుమ్ తిరునేమివలవా తెయ్వక్కోమానే *
శేఱార్ శునై త్తామరై శెన్దీమలరుమ్ తిరువేజ్గడత్తానే *
ఆఱావన్బిలడియేన్ ఉన్నడిశేర్ వణ్ణమరుళాయే. ౨

కొడు వల్ అశురర్ కులమెల్లామ్ కూఱాయ్ నీఱాయ్ నిలనాకి శీఱా ఎటి యుమ్ తిరు నేమి వలవా! తెయ్వమ్ కోమానే! శేఱు ఆర్ శునై తామరై శెమ్ తీ మలరుమ్ తిరువేజ్గడత్తానే! ఆఱా అన్బిల్ అడియేన్ ఉన్ అడి శేర్ వణ్ణమ్ అరుళాయ్.

క్రూరులై బలిష్ఠులైన యసురులయొక్క వంశమంతయు తునకలై భస్మమై నేలమై (మన్నై - నిశ్శేషమై) పోవునట్లు కోపగించి జ్వలించుచున్న సుదర్శనమును దక్షిణహస్త మందు గలవాఁడా! నిత్యసూరులకు నాయకుఁడా! బురదచేఁ బూర్ణమైన చెలమనీళ్ళ యందలి తామరసపుష్పము ఎఱ్ఱని నిప్పువలె (కాంతిగలదై) వికసించుచున్న వేంకటాచలమునకు స్వామియైనవాఁడా! అపరిచ్ఛిన్నమైన (నీ విషయమైన) స్నేహముతో నున్న (స్నేహము గల) దాసుండనైన నేను నీయొక్క శ్రీపాదములను జేరువిధమును గృపఁజేయుమా.

తా. శత్రుసంహారకులైన సుదర్శనాళ్వార్లను శ్రీహస్తమందు ధరించి, అతి రమణీయమైవ వేంకటాద్రియందు వేంచేసియున్న ఓ శ్రియఃపతీ! నాపాపములను బోఁగొట్టి నీభక్తుఁడనైన నన్ను నీతిరువడికళయందుఁ జేర్చుకొనుమా. ౩

వణ్ణమరుళ్ కొళణిమేగవణ్ణా మాయవమ్మానే *
ఎణ్ణమ్పుగున్దుతిత్తిక్కుమముదే ఇమైయోరదిపతియే *

తెన్నలరువిమణిపొన్ముత్తలైక్కుమ్ తిరువేఙ్గడత్తానే *
అణ్ణలేడున్నడిశేర అడియేన్ కావావెన్నాయే. ౩

వణ్ణమ్ మరుళ్ కొళ్
అణి మేకమ్ వణ్ణా మాయమ్
అమ్మానే! ఎణ్ణమ్ పుకున్దు
తి త్తిక్కుమ్ అముదే! ఇమై
యోర్ అతిపతియే! తెళ్ నల్
అరువి మణి పొన్ ముత్తు
అలైక్కుమ్ తిరువేఙ్గడత్తానే!
అణ్ణలే! ఉన్ అడి శేర అడి
యేఱ్కు ఆ ఆ ఎన్నాయ్.

కాంతిచేత మోహింపఁజేసెడి శ్లాఘ్యమైన మేఘమువంటి కాంతిగలవాఁడా! ఆశ్చర్యచేష్టితములు గలవాఁడవై నాకు స్వామియైనవాఁడా! (నా) మనస్సులోఁ బ్రవేశించి తీయగానున్న అమృతమువంటివాఁడా! నిత్యసూరులకు స్వామియైనవాఁడా! నిర్మలమై శ్లాఘ్యమైన కొండకాలవలు రత్నములను బంగారమును ముత్యములను తీరమందు గుంపుగాఁ జేర్చుచున్న వేంకటాద్రియందు వేంచేసియున్న ఓ స్వామీ! నీ శ్రీపాదములను బొందునట్లు దాసునికి అయ్యో! అయ్యో! అని కనికరించుమా.

తా. నిత్యసూరిసేవ్యుఁడవై యతి సుందరంబులైన దివ్యరూపచేష్టితములు గలవాఁడవై తిరుమలయందు వేంచేసి నన్ను దాసునిగాఁ జేకొని నాహృదయమందుఁ బ్రవేశించియున్న ఓ శ్రియఃపతీ! ఈసంసారమందుండి బాధపడుచున్న నన్ననుగ్రహించి నీ శ్రీపాదములయందుఁ జేర్చుకొనుమా. ... ౩

ఆవావెన్నాదులగత్తైయలైక్కుమ్ అశురర్ వాణాళ్ మేల్ *
తీవాయ్ వాళిమழைపొழிన్దశిలైయా తిరుమామగళ్ కేళ్వా
తేవా * శురర్ గళ్ మునిక్కణఙ్గళ్ విరుమ్బుమ్ తిరువేఙ్గడత్తానే *
పూవార్ కழల్ గళరువినైయేన్ పొరున్దుమాఱుపుణరాయే. ౪

ఉలకత్తై ఆఆఎన్నాతు
అలైక్కుమ్ అశురర్ వాణాల్
మేల్ తీవాయ్ వాళి మழை

లోకములను అయ్యో! అయ్యో! అని కనికరింపక బాధించుచున్న యసురులయొక్క జీవితకాలముమీఁద నిప్పును ముఖమందుగల

పాఖ్రిన్ద శిలైయా! తిరుమా మకళ్ కేళ్వా! తేవా! శురర్ కళ్ ముని కణజ్గళ్ విరు మ్బుమ్ తిరువేజ్గడత్తానే! పూ అర్ క్కళ్ల్ కళ్ అరు విసై యేఁ పొరున్దుమాఋ పుణ రాయ్.

బాణములయొక్క వర్షమును గురిపించుచున్న ధనుస్సుగలవాఁడా! పెరియపిరాట్టికి వల్లభుఁడా! ఉజ్జ్వలస్వరూపుఁడా! దేవతలును ఋషులును సమూహములుగనుండి నమస్కరించుచున్న ఓ వేంకటాచలపతీ! పుష్పములతో సమానములైన (నీ) పాదములను క్రూరమైన పాపముగల నేను పొందెడివిధమును సంకల్పించుమా.

తా. విరోధులను నశింపఁజేసి భక్తజనులా శ్రయించునట్లు వేంకటాద్రియందు వేంచేసియున్న ఓ శ్రియఃపతీ! నాపాపములనుఁ బోగొట్టి నీపాదములయందుఁ జేరునట్లు సంకల్పించుమా. ... ... ౪

పుణరానిన్ఱ మరమేళ్ అన్ఱెయ్ దవారువిల్ వలవావో *
పుణరేయ్ నిన్ఱ మరమిరణ్డిన్ నడువేపోనముతల్ వావో *
తిణరార్ మేగమెనక్కళిఋ శేరుమ్ తిరువేజ్గడత్తానే *
తిణరార్ శార్జ్గత్తునపాదమ్ శేర్వ్వదడియే నెన్నాళే. ౫

పుణరా నిన్ఱ మరమ్ ఏళు అన్ఱు ఎయ్ త ఒరు విల్ వలవా ఓ! పుణర్ ఏయ్ నిన్ఱ ఇరణ్డు మరత్తిన్ నడువే పోన ముతల్వా ఓ! తిణర్ అర్ మేక మెన కళిఋ శేరుమ్ తిరు వేజ్గడత్తానే! తిణర్ అర్ శార్జ్గమ్ ఉనపాతమ్ అడియేన్ శేర్వ్వతు ఎన్నాళ్ ఓ ఓ.

గుంపుగాఁ జేరియున్న సాలవృక్షముల నేడింటిని యప్పుడు కొట్టిన యద్వితీయుఁడవైన ధనుర్ధరుఁడా! చేరికను బొందియున్న రెండు మద్దివృక్షములయొక్క నడుమన వెళ్ళిన జగత్కారణుఁడా! దట్టమైయున్న మేఘములవలెనున్న యేనుఁగులు చేరియున్న వేంకటాచలమునకు స్వామీ! బలముచేఁ బూర్ణమైన ధనస్సుగల నీయొక్క తిరువడిగళను దాసుఁడనైన నేను పొందుట ఎప్పుడు? అయ్యో!

తా. ఒకవరుసగా లేకుండ గూఢముగాఁ జుట్టునున్న సాలవృక్షముల నేడింటిని యొకబాణముచేఁ గొట్టిన శూరుఁడవైన వేంకటాచలపతీ! నే నీసంసార దుఃఖమును వదలి నీతిరువడికళ నెప్పుడుఁ చేరెదనో? ... ౫.

ఎన్నాళేనామ్మణ్ణళన్ద ఇణై త్తామరైగళ్ కాణ్బదర్కెన్ఱు *
ఎన్నాళుమ్నిన్ఱిమైయోర్గళేత్తి ఇఱైఞ్జియినమినమాయ్ *
మెయ్న్నామనత్తాల్ వழிపాడు శెయ్యుమ్ తిరువేఙ్గడత్తానే *
మెయ్న్నానెయ్దియెన్నాళ్ ఉన్నడిక్కళడియేన్ మేవువదే. ౬

మణ్ అళన్ద తామరై కళ్ ఇణై నామ్ కాణ్బ తఱ్కు ఎన్నాళేమ్ ఎన్ఱు ఇమైయోర్కళ్ ఎన్నాళుమ్ నిన్ఱు ఏత్తి ఇఱైఞ్జి ఇనమిన మాయ్ మెయ్ నా మన త్తాల్ వழிపాడు శెయ్యుమ్ తిరువేఙ్గడత్తానే అడియేన్ నాన్ మెయ్ ఎయ్తి ఉన్ అడిక్కళ్ మేవువతు ఎన్నాళ్.

భూమిని గొలిచిన శ్రీపాదపద్మములను రెండింటిని మనము సేవించుట ఏదినము సంభవించునో? యని నిత్యసూరు లెల్లప్పుఁడును చేరియుండి స్తుతించి యాశ్రయించి గుంపులుగుంపులుగా శరీరవాఙ్మనస్సులచేత కైంకర్యముచేయుచున్న ఓ వేంకటాచలపతీ! దాసుఁడనైన నేను యథార్థముగా (ప్రత్యక్షముగ) పొంది నీ శ్రీపాదములం దమరియుండుట యెప్పుడో?

తా. త్రివిక్రమావతారమందు లోకములను గొలిచిన నీ శ్రీపాదములను సేవింప నాశపడి నిత్యసూరులువచ్చి మనోవాక్కాయములచేఁ గైంకర్యముఁ జేయునట్లు వేంకటాద్రియందు వేంచేసియున్న ఓ శ్రియఃపతీ! నీ శ్రీపాదములను నే నెప్పుడు ప్రత్యక్షముగా సేవించెదనో? ... ... ౬

అడియేన్మేవియమర్గిన్ఱవముదే ఇమైయోరదిపతియే *
కొడియావడుపుళ్ళుడైయానే కోలక్కనివాయ్ పెరుమానే *

Funding: Tattva Heritage and IKS-MoE. Digitization: eGangotri.



శెడియార్ విన్నైగళ్ తీర్ మరున్దే తిరువేజ్గడత్తెమ్బెరుమానే *
నొడియార్ పొళుదుమునపాదమ్ కాణనోలాదాఱ్ఱేనే. ౭

అడియేన్ మేవి అమర్కిన్ఱ అముతే ఇమైయోర్ అతిపతియే! అడు పుళ్ కొడియా ఉడైయానే! కోలమ్ కనివాయ్ పెరుమానే శెడి ఆర్ విన్నైకళ్ తీర్ మరున్దే తిరువేఙ్గడత్తు ఎమ్బెరుమానే! ఉన పాతమ్ కాణనోలాతు నొడి. ఆర్ పొళుతుమ్ అఱ్ఱేన్.

దాసుఁడనైన నేను సమీపించి నిరంతరానుభవముఁ జేయుచున్న యమృతమువలె భోగ్యభూతుఁడా! నిత్యసూరులకు నిర్వాహకుఁడా! (శత్రువులను) నశింపఁజేయుచున్న గరుత్మంతుని ధ్వజముగాఁ గలవాఁడా! సుందరమైపండువలెనున్న యధరముగల గొప్పవాఁడా! పాపములచేఁ గలిగిన దుఃఖములను దీర్చెడి ఔషధమువంటివాఁడా! వేంకటాద్రియందు వేంచేసియున్న మనస్వామీ! నీతిరువడికళను సేవించుటకుఁ దగిన పుణ్యముఁ జేయక (ఉండినను) కలతోఁ జేరిన ఒకక్షణమును (నిన్ను సేవింపక) సహించియుండలేను.

తా. నిత్యసూరి నిర్వాహకుఁడవై, సకల శత్రువులను నాశ్రితపాపములను నశింపఁజేయువాఁడవై, వేంకటాద్రియందు వేంచేసియుండి నాకుఁ బరమభోగ్యుఁడవైయున్న ఓ శ్రియఃపతీ! నిన్నుబొందుటకు నేనొక సాధనానుష్ఠానముఁ జేసినవారివలె నిన్నుసేవింప మిక్కిలి త్వరపడుచున్నాను. ... ౭

నోలాదాఱ్ఱేనునపాదమ్ కాణవెన్ఱునుణ్ణుణర్విల్ *
నీలార్ కణ్డత్తమ్మానుమ్ నిఱైనాన్ముగనుమిన్దిరనుమ్ *
శేలేయ్ కణ్ణార్ పలర్ శూళ్విరుమ్బుమ్ తిరువేఙ్గడత్తానే *
మాలాయ్ మయక్కియడియేన్పాల్ వన్దాయ్ పోలేవారాయే. ౮

ఉనపాతమ్ కాణ నోలాతు అఱ్ఱేన్ ఎన్ఱు నుణ్ణు

నీ శ్రీపాదములను సేవించుటకు భాగ్యముఁ జేయకయుండియు నిన్ను వదలియుండలేను; అని

ణర్విల్ నీల్ ఆర్ కణ్డమ్ అమ్మానుమ్ నిత్తై నాన్ముక నుమ్ ఇన్దిరనుమ్ శేలేయ్ కణ్ణార్ పలర్ శూழ విరు మ్బుమ్ తిరువేఙ్గడత్తానే! మా లాయ్ మయక్కి వన్దాయ్ పో లే అడియే న్పాల్ వారాయ్.

చెప్పి సూక్ష్మమైన బుద్ధిగల నీలవర్ణముచేఁ బూర్ణ మైన కంఠముగల ప్రధానుఁడైన రుద్రుఁడును జ్ఞానపూర్తిగల చతుర్ముఖుఁడును ఇంద్రుఁడును మత్స్యముతోఁబోలిన నేత్రములుగల (సరస్వతి పార్వతి మొదలగు) అనేకస్త్రీలతోఁగూడఁ జుట్టఁ బడినవారై ప్రీతితో నాశ్రయించుచున్న ఓ వేంక టాద్రినాథుఁడా! శ్యామవర్ణముగల కృష్ణుఁడై మోహపఱచి (వసుదేవాదులముందఱ) వేంచేసి నట్లు నాముందఱ వేంచేయుమా.

తా. ఓ శ్రియఃపతీ! సాధనానుష్ఠానముఁ జేయని నేనుమాత్రమేగాక సాధ నాంతరపరులై జ్ఞానవంతులై సమర్థులైయున్న బ్రహ్మరుద్రేంద్రాదులుగూడ నైచ్యానుసంధానముఁ జేయుచు తమతమస్త్రీలతోఁగూడ వచ్చి యాశ్రయించు నట్లు వేంకటాద్రియందు వేంచేసియున్న నీవు కృష్ణావతారమందు వసుదేవాదు లకువచ్చి సేవసాదించినట్లు నాముందఱ వేంచేసి సేవసాదించుము.

వన్దాయ్ పోలేవారాదాయ్ వారాదాయ్ పోల్ వరువానే *
శెన్దామరై క్కణ్ శెఙ్గనివాయ్ నాల్ తోళమదేఎనదుయిరే *
శిన్దామణిగళ్ పగరల్లైప్పగల్ శెయ్ తిరువేఙ్గడత్తానే *
అన్దో! వడియేనున పాదమ్ అగలకిల్లేనిత్తైయుమే.

(అభక్తులకు) వచ్చినవాఁడు (సులభుఁడు) వలెనుండి రానివాఁడును (దుర్లభుఁడును) (భక్తు లకు) రానివాఁడు (అసులభుఁడు) వలెనుండి వచ్చు చున్నవాఁడును (సులభుఁడును) ఎట్టిని పద్మము వలెనున్న నేత్రములను, ఎట్టిని దొండపండువలె

వన్దాయ్ పోలే వారా తాయ్ వారాతాయ్ పోల్ వరువానే! శెమ్ తామరై కణ్ శెమ్ కని వాయ్ నాల్ తోళ్

అము తే! ఎనదు ఉయిరే! శిన్దామణికళ్ పకర్ అల్లై పకల్ శెయ్ తిరువేఙ్గడత్తానే! అన్దో ఉన పాతమ్ అడియేఞ్ ఇఱైయుమ్ అకల కిల్లేఞ్.

నున్న యధరమును, నాలుగు భుజములనుగల భోగ్యభూతుఁడా! నాకు ప్రాణభూతుఁడా! తలంచినదాని నివ్వఁదగిన చింతామణులయొక్క కాంతి రాత్రిని దినమువలె చేయుచున్న తిరుమలయందు వేంచేసియున్న ఓ శ్రియఃపతీ! అయ్యో! నీ శ్రీపాదములను దాసుఁడనైన నేను క్షణమాత్రముగూడ నెడబాసి యుండలేను.

తా. భక్తులకు సులభుఁడవై యభక్తులకు దుర్లభుఁడవై యతిరమణీయంబులైన దివ్యావయవములుగలవాఁడవై రాత్రిగూడ దినమువలె ప్రకాశించునట్లు మంచి తేజస్సుగల రత్నములచే నిండియున్న వేంకటాద్రియందు వేంచేసియున్న ఓ స్వామీ! నీ శ్రీపాదములను వదలి నేనొక క్షణముగూడ నుండలేను.

* అగలకిల్లేనిఱైయుమెన్ఱు అలర్ మేల్ మఙ్గైయుఱై మార్పా *
నిగరిల్ పుగళాయులగమూన్ఱుడైయాయ్ ఎన్నై యాళ్వానే *
నిగరిలమరర్ మునిక్కణఙ్గళ్ విరుమ్బుమ్ తిరువేఙ్గడత్తానే *
పుగలొన్ఱిల్లావడియేన్ ఉన్నడిక్కీళమర్న్దు పుగున్దేనే. ౧౦

ఇఱైయుమ్ అకల కిల్లేఞ్ ఎన్ఱు అలర్ మఙ్గై ఉఱై మార్ పా నికరిల్ పుకళాయ్ ఉలకమ్ మూన్ఱుడైయాయ్ ఎన్నై ఆళ్వానే నికరిల్ అమరర్ ముని గణఙ్గళ్ విరుమ్బుమ్ తిరువేంగడత్తానే!

ఒకక్షణముగూడ విశ్లేషించియుండుటకు సమర్థురాలుకాను అని పుష్పముమీఁద వాసముఁజేయుచున్న (నిరతిశయభోగ్యురాలైన) పెరియపిరాట్టి నిత్యవాసముఁజేయుచున్న వక్షస్స్థలముగలవాఁడవై, ఒప్పులేని యశస్సుగలవాఁడవై, మూఁడులోకములను (తనకు రక్ష్యములై) కలవాఁడవై, నన్ను బరిపాలించువాఁడవై, ఒప్పులేని నిత్యసూరులును ఋషుల సమూహములును

పుకల్ ఒన్రు ఇల్లా అడియేన్
ఉన్ అడి కీళ్ అమర్న్దు
పుకున్దేనే.

నాశపడి యాశ్రయించుచున్న తిరుమలయందు వేంచేసియున్న ఓ స్వామీ! ఉపాయము ఒకటియు లేని దాసుఁడనైన నేను నీ శ్రీపాదముల క్రింద నమరియున్నవాఁడనై ప్రవేశించితిని.

తా. సౌందర్య సౌగంధ్య మార్దవాదిగుణములచే నిరతిశయభోగ్యురాలైన పెరియపిరాట్టికూడ క్షణకాలము విశ్లేషించియుండలేక నెల్లప్పుఁడును నీవక్షస్థలమందు నిత్యవాసముఁ జేయునట్లు నిరతిశయభోగ్యభూతుఁడవై, నిరుపమానంబులైన వాత్సల్యాది కల్యాణగుణములుగలవాఁడవై, సకలజగద్రక్షకుఁడవై, నిత్యసూరిసేవ్యుఁడవై, వేంకటాద్రియం దత్యంతసులభుఁడవై వేంచేసియున్న ఓ శ్రీమన్నారాయణుఁడా! నేను సకలోపాయములను వదలి నీ తిరువడికళనే యుపాయముగానమ్మి యాశ్రయించితిని:—ఈపాశురము ద్వయార్థప్రతిపాదకమని పూర్వాచార్యులు నిర్వహించుదురు. ... ... ... ౧౦

అడిక్కీళ్ అమర్న్దుపుగున్దుఅడియీర్ వాళ్ మినెన్రెన్రరుళ్ కొడుక్కుమ్ *
పడిక్కేళ్ ఇల్లాప్పెరుమానై ప్పళనక్కురుగూర్ చ్చడగోపన్ *
ముడిప్పాన్ శొన్న వాయిరత్తు త్తిరువేఙ్గడత్తుక్కివై పత్తుమ్ *
పిడిత్తార్ పిడిత్తార్ వీత్తిరున్దు పెరియవానుళ్ నిలావువరే. ౧౧

అడియీర్! అడిక్కీళ్
అమర్న్దు పుకున్దు వాళ్మిన్
ఎన్రెన్రు అరుళ్ కొడుక్కుమ్
పడి కేళ్ ఇల్లా పెరుమానై
పళనమ్ కురుకూర్ శడకోపన్
ముడిప్పాన్ శొన్న ఆయిరత్తు
తిరు వేఙ్గడత్తుక్కు ఇవై

ఓ భక్తులారా! శ్రీపాదములక్రింద (అనన్యప్రయోజనులై) యమరియుండి ప్రవేశించి యుజ్జీవించుఁడని యుపదేశించి కృపఁజేయుచున్న విధమునకో కుప్పులేని సర్వేశ్వరు నుద్దేశించి పొలములచే సమృద్ధమైన కురుకాపురికి స్వామియైన నమ్మాళ్వార్లు (తమదుఃఖమును) నశింపఁజేయుటకై ప్రసాదించిన వేయిపాశురములలోఁ జేరిన తిరుమలను బ్రతిపాదించుచున్న, యీ పదిపాశుర

| | |
|---|---|
| పత్తుమ్ పిడిత్తార్ పిడిత్తార్ పెరియ వానుళ్ నీళ్ శిరున్దు నిలావువర్. | ములను నాశ్రయించినవారిని (అభ్యసించిన వారిని) నాశ్రయించినవారు గొప్పమహిమగల పరమపదమునందు విలక్షణులై యుండి నిత్యాను భవముఁ జేయుదురు. |

తా. ఓ భక్తులారా! మీరు శ్రీపాదముల నాశ్రయించి యుజ్జీవించుఁడని తన శ్రీహస్తముచేఁ దిరువడికళను జూపుచు నుపదేశించుచున్న నిరవధికదయావంతుఁడైన తిరువేంగడముడైయాను విషయమై నమ్మాళ్వార్లు ప్రసాదించిన యీ పదిపాశురముల నభ్యసించువారును వారి నాశ్రయించువారును శ్రీవైకుంఠమందు వెళ్ళి నిత్యానందము ననుభవింతురు. ... ... ౧౧

షష్ఠశతకములో దశమదశకము ముగిసెను.

ఆళ్వార్ ఎమ్బెరుమానార్ జీయర్ తిరువడికళే శరణమ్.

తిరువాయ్ మొళ్ళి టీకలో

ఆఱవపది ముగిసెను.



కీ. శే. గొల్లపూడి రంగనాయకులు శెట్టి
తిరువాయ్ మొళి టీక ముద్రణముకొఱకు.
రూ. ౧౨౫ ఉపకరించినవారు.
వీరి కుటుంబమునకు నిత్యశ్రీః.

శ్రీమతేరామానుజాయ నమః

# నాలాయిర దివ్యప్రబంధ టీక ప్రకటన

మన శ్రీవైష్ణవ సంప్రదాయ ప్రవర్తకులైన ఆళ్వార్లు సాయిం చిన ద్రావిడవేద మనబడు నాలాయిర దివ్యప్రబంధములకు సంపూర్తిగా ఆంధ్ర టీకా తాత్పర్యము అచ్చువేయబడుచున్నదనే విషయము సుప్రసిద్ధమేగదా. మొదటిసహస్రమునకు టీక ముద్రణము సంపూర్తి అయినది. తర్వాత తిరువాయ్ మొళి ప్రారంభించి ౬ శతకముల టీక సంపూర్తి అయినది. క్రమేణ ప్రతిమాసమునకు ఒక శతకమునకు టీక ప్రచురింపబడుచున్నది. దీనికి ప్రత్యేకమూల్యము లేదు. 80 రూ. మొత్తముగా చెల్లించువార్లకు సకల దివ్యప్రబంధ టీకలు లభ్యమగును.

మొదటి సహస్రములో ప్రచురింపబడిన దివ్యప్రబంధములు

(టీకా తాత్పర్యసహితము)

౧. తిరుప్పల్లాండు. ౨. పెరియాళ్వార్ తిరుమొళి ౪౭౦ పాశురములు.
3. తిరుప్పావ. ౪. నాచ్చియార్ తిరుమొళి.
౫. పెరుమాళ్ తిరుమొళి. ౬. తిరుచ్చంద విరుత్తము.
౭. తిరుమాల. ౮. తిరుప్పళ్ళి యెళుచ్చి.
౯. అమలనాదిపిరాళ్. ౧౦. కణ్ణినుణ్ శిఱుత్తాంబు.

ఇట్లు,

**P. B. ANNANGARACHARYA;**
**L. Kancheepuram.**